# పీఠిక

ఆంధ్రభాషా పోషకులారా!

సమస్త భాషలకు తల్లియగు సంస్కృతభాషకు మిక్కిలి గారాబము సంతానమై "దేశ భాషలందు తెలుంగు లెస్స" అని సుప్రసిద్ధిగాంచిన ఆంధ్ర వాఙ్మయము క్రమాభివృద్ధినొందుచున్నది. క్రీస్తుశకమునకు పూర్వము కొన్ని సంస్కృత గ్రంథముల కనువాదములు నిర్మింపఁబడినవి. క్రీస్తుశకము 1500 సం. "ఆంధ్రభోజు"డను బిరుదుచే విరాజిల్లు కృష్ణదేవరాయలు, విజయనగరాధీశుఁడై రాజ్యము పాలనము జేయుచుండ, వారి యాస్థానకవులచే ననేక స్వతంత్ర గ్రంథములు పురాణ గాథను మాతృకగా స్వీకరించి వ్రాయఁబడినవి. రాయలవారి యాస్థానమునం "దష్టదిగ్గజము"లనబడు కవీశ్వరులలో "అల్లసాని పెద్దన"యను కవి ప్రధానస్థాన మలంకరించెను. ఇతఁడు కవియే గాక విద్వాంసుఁడునై "విద్వత్కవి"యని పిలువబడుచు, శఠకోప యతీశ్వరునకు ప్రియశిష్యుఁడై వారి వలన మతధర్మములను గ్రహించిన మహానుభావుఁడు. ఈ కవి మార్కండేయ పురాణాంతర్గత గాథను మాతృకగా పరిగ్రహించి "మనుచరిత్ర"మను గ్రంథమును నిర్మించెను. ఈ గ్రంథమును రాయలవారు స్వీకరించునపుడు అల్లసాని పెద్దనార్యుని ఊరేగించవలయునని స్వయముగా తన హస్తముతో పల్లకిని లేవనెత్తి పెద్దనార్యునిపై తనకుగల గౌరవాభిమానములను వెల్లడించెను.

ఒకనాటి సమయమున రాయలవారు వెండి పళ్లెరములో "గండపెండేరము"అను గౌరవాభరణము నుంచి "ఉభయభాషా పాండిత్యము గలవారై సరళ శైలిలో కవిత్వము జేయు"వారికిది సన్మానముగా నొసంగబడునని పలుకగా పెద్దనార్యుడు తప్ప మిగత యాస్థానకవులందరును నిశ్శబ్దముగా నుండిరి. అప్పుడల్లసాని పెద్దన్న లేచి,

ఉత్పలమాలిక.

పూఁతమెఱుంగులుం బసరు♦పూపబెడంగులుఁ జూపునట్టి వా
కైతలు జగ్గునిగ్గు సెన ♦ గావలెఁ గమ్మనఁ గమ్మనన్ వలెన్
రాతిరియుం బవల్ మఱపు ♦ రానిహొయల్ చెలియారజంపుని
ద్దాతరి తీపులం బలెను ♦ దారసిలన్ వలె లోఁ దలంచినన్
... ... ... ...

ఈ మొదలుగా నాశుకవిత్వము ఇరువదియెనిమిది చరణముల ఉత్పలమాలిక జెప్పెను. రాయలవారు దానిని విని గండపెండేరమును పెద్దనార్యుని పాదమునకు స్వయముగా దొడగి "ఆంధ్రకవితాపితామహ"అను గౌరవనామము నొసంగెను. ఈ కవికి సమకాలికులగు ముక్కుతిమ్మనార్యుడు మొదలగువారి కవితాశైలికన్న ఈ పెద్దనార్యుని కవిత్వము మిగుల రసవంతమై శోభిల్లుచున్నది. నేటివఱకును ఆంధ్రభాషను పోషించుటకై యనేక కవిపుంగవులచే నాటకములు, నవలలు, యక్షగానములు రచింపఁబడుచునే యున్నవి. వీటిలో నీతి విజ్ఞాన సహితములగు గ్రంథముల నాదరించుట భాషాభిమానుల కవశ్య కర్తవ్యము. ఈ భావమును రమాపతి పోషించుగాక.

శ్రీ

# స్వారోచిష
# మనుచరిత్రము

## ప్రథమాశ్వాసము

శ్రీవక్షోజకురంగనాభ మెదపైఁ ♦ జెన్నొంద విశ్వంభరా
దేవిం దత్కమలా సమీపమునఁ బ్రీ♦తిన్ నిల్పినాఁడో యనం
గా వందారుసనందనాది నిజభ♦క్తశ్రేణికిం దోఁచు రా
జీవాక్షుండు కృతార్థుఁ జేయు శుభదృ♦ష్టిం గృష్ణరాయాధిపున్. 1

ఉ. ఉల్లమునందు నక్కటిక ♦ మూనుట మీ కులమందుఁ గంటి మం
చల్లన మేలమాడు నచ♦లాత్మజ మాటకు లేఁతనవ్వు సం
ధిల్లఁ గిరీటిఁ బాశుపత ♦ దివ్యశరార్థ్యునిఁ జేయు శాంబరీ
భిల్లుఁడు కృష్ణరాయల క♦భీష్ట శుభప్రతిపాది గావుతన్. 2

ఉ. నాలుగు మోముల న్నిగమ♦నాదము లుప్పతిలం బ్రచండవా
తూలహతిం జనించు రొద♦తోడి గుహావళి నొప్పు మేరువుం
బోలెఁ బయోజపీఠి ముని♦ముఖ్యులు గొల్వఁగ వాణిఁగూడి పే
రోలగ మున్న ధాత విభ♦వోజ్జ్వలుఁ జేయుతఁ గృష్ణరాయనిన్. 3

ఉ. అంకముఁ జేరి శైలతన♦యా స్తన దుగ్ధము లానువేళ బా
ల్యాంకవిచేష్టఁ దొండమున ♦ నవ్వలి చన్గబళింపఁ బోయి యా
వంకఁ గుచంబుఁ గాన కహి♦వల్లభహారముఁ గాంచి వేగ బి
సాంకురశంక నంటెడు గ♦జాస్యుని గొల్తు నభీష్టసిద్ధికిన్. 4

సీ. చేర్చుక్కగా నిడ్డ ♦ చిన్ని జాబిల్లిచే, సింధూర తిలకంబు ♦ చెమ్మగిల్ల
నవతంస కుసుమంబు♦నం దున్న యెలదేఁటి, రుతి కించిదంచిత♦శ్రుతుల నీన
ఘనమైన రారాపు ♦ చనుదోయి రాయిడిఁ, దుంబీఫలంబు తుం♦దుడుకుఁ జెంద
దరుణాంగుళి చ్ఛాయ ♦ దంతపు సరకట్టు, లింగిలీకపు వింత♦రంగు లీన

గీ. నుపనిషత్తులు బోటులై ♦ యోలగింపఁ, బుండరీకాసనమునఁ ♦ గూర్చుండి మదికి
నించు వేడుక వీణ వా♦యించు చెలువ, నలువరాణి మదాత్మలో ♦ వెలయుఁగాత. 5

క. కొలుతున్ మద్గురు విద్యా, నిలయుం గరుణాకటాక్ష♦నిబిడజ్యోత్స్నా
దళితాశ్రిత జన దురిత, చ్ఛల గాఢధ్వాంతసమితి ♦ శఠకోప యతిన్. 6

మ. వనజాక్షోపము వామలూరు తనయున్ ద్వైపాయనున్ భట్టబా
ణుని భాసున్ భవభూతి భారవి సుబంధున్ బిల్హణుం గాళిదా
సుని మాఘున్ శివభద్రు మల్హణ కవిం జోరున్ మురారిన్ మయూ
రుని సౌమిల్లిని దండిఁ బ్రస్తుతులఁ జేర్కొందు న్వచస్సిద్ధికిన్. 7

ఆ. వ్యాసరచిత భారతామ్నాయ మాంధ్రభాష నొనర్చి జగతిఁ బొగడుఁ గనిన
నన్నపార్యుఁ దిక్కనను సుకృతక్రతు శంభుదాసు నెఱ్ఱసుకవిఁ దలఁతు భక్తి. 8

మ. భరమై తోఁచు కుటుంబరక్షణకుఁగాఁ బ్రాల్మాలి చింతిన్ నిరం
తరతాళీదళ సంపుట ప్రకర కాంతారంబునం దర్థపుం
జెరువాటుల్ దెగి కొట్టి తెజ్జపరిషద్విజ్ఞాత చౌర్యక్రియా
విరసుండై కొఱఁతం బడుం గుకవి పృథ్వీభృత్సమీపక్షితిన్. 9

క. అని యిష్టదేవతా వందన సుకవిస్తుతులుఁ గుకవితతినిరాకృతియుఁ జే
సి నవీన కావ్యరచనకు, ననుకూల కథల్ దలంతు నా సమయమునన్. 10

సీ. ఉదయాచలేంద్రంబు మొదల నెవ్వని కుమారరతకుఁ గ్రీడాచలరాజమయ్యె
నావాడ పతిశకంధర సింధురాధ్యక్షు, లరిగాపు లెవ్వాని ఖరతరాసి
కా పంచగౌడ ధాత్రీపదం బెవ్వాని, కసివారుగా నేగునట్టి బయలు
సకల యాచక జనాశాపూర్తి కెవ్వాని, ఘనభుజాదండంబు కల్పశాఖి

గీ. ప్రబల రాజాధిరాజ వీరప్రతాప, రాజ పరమేశ బిరుదు విభ్రాజి యెవ్వఁ
డట్టి శ్రీకృష్ణదేవరా యాగ్రగణ్యుఁ, డొక్కనాఁడు కుతూహలం బుప్పతిల్ల. 11

సీ. ఇందీవరంబుల నీను కాల్గన్నుల, శరదిందుముఖులు చామరము లిడఁగ
బఱచిన సూనుకణాద బాదరాయణ సూత్ర, ఫక్కి విద్వాంసు లుపన్యసింపఁ
బార్శ్వభూమి నభీరు భటకదంబకరాళ, హేతిచ్ఛటాచ్ఛాయ నిరులు గొనఁగ
సామంత మండనోద్ధామ మాణిక్యాంశు, మండలం బొలసి యీరెండ గాయ

గీ. మూరురాయరగండ పెండారమణి మరీచి రింఛోళిఁ గలయ నావృతము లగుచు
నంకపాళి నటద్దుకూలాంచలములు, చిత్రమాంజిష్ఠ విభ్రమ శ్రీ వహింప. 12

క. భువన విజయాఖ్య సంసద్భవనస్థిత సింహపీఠిఁ బ్రాజ్ఞుల గోష్ఠిం
గవితా మధురిమ డెందము, దవులం గొలువుండి సదయతన్ ననుఁ బల్కెన్. 13

తే. సప్తసంతానములలోఁ బ్రశస్తి గాంచి, ఖిలముగా కుండునది ధాత్రిఁ గృతియ కాన
కృతి రచింపుము మాకు శిరీషకుసుమ, పేశల సుధామయోక్తులఁ బెద్దనార్య 14

క. హితుఁడవు చతుర వచోనిధి, వతుల పురాణాగమేతిహాస కథార్థ
స్మృతియుతుఁడ వాంధ్రకవితా, పితామహుఁడ వెవ్వరీఁడు పేర్కొన నీకున్. 15

క. మనువులలో స్వారోచిష, మనుసంభవ మరయ రససమంచిత కథలన్
విన నింపు కలిధ్వంసక, మనఘ భవచ్చతుర రచన కనుకూలంబున్. 16

వ. కావున మార్కండేయ పురాణోక్త ప్రకారంబునం జెప్పుమని యడిగి కర్పూర తాంబూలంబు పెట్టినం బట్టి మహాప్రసాదంబని మోదంబున నమ్మహాప్రబంధ నిబంధనంబునకుఁ బ్రారంభించితి నేతత్కథానాయక రత్నంబగు నమ్మహీనాథు వంశావతారం బెట్టిదనిన. 17

సీ. కలశపాథోరాశి ♦ గర్భవీచిమతల్లి, కడుపార నెవ్వానిఁ ♦ గన్నతల్లి
యనలాక్షు ఘనజటా♦వనవాటి కెవ్వాఁడు, వన్నెఁ బెట్టున నార్త♦వంపుఁ బువ్వు
సకల దైవత బుభు♦క్షాపూర్తి కెవ్వాఁడు, పుట్టు గానని మేని ♦ మెట్టపంట
కటికి చీకటి తిండి♦కరముల గిలిగింత, నెవ్వాఁడు తొగకన్నె ♦ నవ్వఁజేయు

గీ. నతఁడు వొగడొందు మధుకైట♦భారి మఱఁది, కళల నెలవగువాఁడు♦ చుక్కలకుఱేఁడు
మిసిమిపరసీమ పలరాజు ♦ మేనమామ, వేవెలుంగుల దొరజోడు ♦ రేవెలుంగు. 18

తే. ఆ సుధాధాము విభవ మ♦హాంబురాశి, కుబ్బుమీఱంగ నందనుఁ ♦ డుదయమయ్యె
వేదవేదాంగ శాస్త్రార్థ ♦ విశదవాస,నాత్మధిషణా ధురంధరుం♦డైన బుధుఁడు. 19

క. వానికిఁ బురూరవుఁడు ప్రజ్ఞానిధి యుదయించె సింహ♦సదృశుఁడు తద్భూ
జానికి నాయువు తనయుం,డై నెగడెఁ నతండు గనె య♦యాతి నరేంద్రున్. 20

క. అతనికి యదుతుర్వసు లను, సుతు లుద్భవమొంది రహిత♦సూదనులు కళా
న్వితమతులు వారిలో విశ్రుతకీర్తి వహించెఁ దుర్వ♦సుఁడు గుణనిధియై. 21

తే. వాని వంశంబు తుళువాన్వ♦వాయ మయ్యె, నందు బెక్కండ్రు నృపు లుద♦యంబునొంది
నిఖిల భువనప్రపూర్ణ ని♦ర్ణిద్ర కీర్తి, నధికులైరి తదీయాన్వ♦యమునఁ బుట్టి. 22

మహాస్రగ్ధర. ఘనుఁడై తిమ్మక్షితీశా♦గ్రణి శరకమఠ♦గ్రాహ సంఘాతవాతా
శవరాడాక్రాంతదంతి♦స్తవిరకిరుల జం♦జాటముల్మాన్పి, యిమ్మే
దిని దోర్దండైక పీఠిం ♦ దిరముపఱచి, కీ♦ర్తిద్యుతుల్ రోదసిం బ
ర్వ నరాతుల్ నమ్రులై పా♦ర్శ్వములఁ గొలువఁ దీ♦వ్రప్రతాపంబు సూపెన్. 23

క. వితరణఖని యా తిమ్మ, క్షితిపగ్రామణికి దేవ♦కీదేవికి నం
చితమూర్తి యీశ్వర ప్రభుఁ, డతిపుణ్యుఁడు పుట్టె సజ్జ♦నావనపరుఁడై. 24

చ. బలమదమత్త దుష్టపుర♦భంజనుఁడై పరిపాలితార్యుఁడై
యిలపయిఁ దొంటి యీశ్వరుఁడె ♦ యీశ్వరుఁడై జనియింప రూప తెన్
జలరుహనేత్రలం దొఱఁగి ♦ శైలవనంబుల భీతచిత్తులై
మెలఁగెడు శత్రుభూపతుల ♦ మేనులఁ దాల్చిన మన్మథాంకముల్. 25

సీ. నిజభుజాశ్రిత ధారు♦ణీ వజ్రకవచంబు, దుష్టభుజంగాహి♦తుండికుండు
వనజేక్షణా మనో♦ధనపశ్యతోహరుం, డరిహంస సంపద♦భ్రాగమంబు
మార్గణగణపిక ♦ మధుమాస దివసంబు, గుణరత్న రోహణ♦క్షోణిధరము
బాంధవ సందోహ ♦ పద్మవనీహేళి, కారుణ్య రసనిమ్న,గా కళత్రు

గీ. డన జగంబుల మిగులఁ బ్ర♦ఖ్యాతిగాంచె, ధరణిధవదత్త వివిధోప♦ధా విధాన
మార్జిత శ్రీవినిర్జిత ♦ నిర్జరాల,యేశ్వరుఁడు తిమ్మభూపతి ♦ యీశ్వరుండు. 26

క. ఆ యీశ్వరనృపతికిఁ బుణ్యాయతమతి యైన బుక్క♦మాంబకు దేజ
స్తోయజ హితు లుదయించిరి, ధీయుతులగు నారసింహ ♦ తిమ్మనరేంద్రుల్. 27

క. అందు నరసప్రభుఁడు హరి,చందన మందారకుంద ♦ చంద్రాంశునిభా
స్పంద యశస్తుందిలదిక్కందరుఁడై ధాత్రి యేలె ♦ గలుషము లడఁగన్. 28

ఉ. శ్రీరుచిరత్వభూతిమతి ♦ జిత్వరతాకృతి శక్తి కాంతులన్
ధీరత సారభోగముల ♦ ధీనిధి యీశ్వర నారసింహుఁ డా
వారిజనాభ శంకరుల ♦ వారి కుమారుల వారి తమ్ములన్
వారి యనుంగు మామలను ♦ వారి విరోధులఁ బోలు నిమ్మహిన్. 29

సీ. అంభోధివసన వి♦శ్వంభరావలయంబుఁ, దన బాహుపురి మర♦కతముఁ జేసె
నశ్రాంత విశ్రాణ♦నాసార లక్ష్మికిఁ, గవికదంబముఁ జాత♦కములఁ జేసెఁ
గకుబంత నిఖిల రా♦ణ్ణికరంబుఁ జరణ మంజీరంబు సాలభం♦జికలఁ జేసె
మహనీయ నిజ విని♦ర్మల యశస్సరసికి, గగనంబుఁ గలహంస♦కంబుఁ జేసె

గీ. నతిశిత కృపాణ కృత్తస♦మస్తారి వీర, మండలేశ సకుండల♦మకుట నూత్న
మస్త మాల్యపరంపరా♦ మండ నార్చి, తేశ్వరుండగు నారసిం♦హేశ్వరుండు. 30

తే. ఆ నృసింహప్రభుండు తి♦ప్పాంబ వలన, నాగమాంబిక వలన నం♦దనులఁ గాంచె
వీర నరసింహరాయ భూ♦విభుని నచ్యు,తాంశ సంభవుఁ గృష్ణరా♦యక్షితీంద్రు. 31

క. వీర నృసింహుఁడు నిజభుజ, దారుణ కరవాల పటిమ♦ధారాహత వీ
రారి యగుచు నేకాతప, వారణముగ నేలె ధర న♦వారణ మహిమన్. 32

క. ఆ విభు ననంతరంబ ధ,రావలయముఁ దాల్చెఁ గృష్ణ♦రాయఁడు చిన్నా
దేవియు శుభమతి తిరుమల, దేవియునుం దనకుఁ గూర్చు ♦ దేవేరులుగాన్. 33

సీ. తొలఁగెను ధూమకే♦తు క్షోభ జనులకు, నతివృష్టి దోష భ♦యంబు వాసెఁ
గంటకాగమ భీతి ♦ గడచె నగ్ధత భూమి, భృత్కోటకంబెల్ల ♦ నెత్తువడియె
మాసె నఘస్ఫూర్తి ♦ మరు భూములందును, నెల మూఁడు వానలు ♦ నిండ గురిసె
నాబాలగోపాల ♦ మఖిల సద్విజమును, నానందమున మన్కి ♦ నతిశయిల్లెఁ

గీ. బ్రజల కెల్లను గడు రామ♦రాజ్యమయ్యెఁ, జారు సత్త్వాఢ్యుఁ డీశ్వర ♦ నారసింహ
భూవిభుని కృష్ణరాయఁ డ♦భ్యుదయ మొంది, పెంపు మీఱంగ ధాత్రిఁ బా♦లింపుచుండ.

మ. అలపోత్రిప్రభుదంష్ట్రి భోగివర భో♦గాగ్రశిరా ఉద్భటా
చలకూటోపలకోటి రాపుచెట ని♦చ్చల్ రాయఁగా నైన మొ
క్కలు భూకాంతకు నున్నవయ్యె న♦సహ్యాపాలు శ్రీకృష్ణరా
యల బాహా మృగనాభిసంకుమద సాం♦ద్రాలేప పంకంబునన్. 35

ఉ. క్రూర వనేభదంతహత ♦ కుడ్య పరిచ్యుత వజ్ర పంక్తిఁ బో
ల్పారు మిడుంగుఱుం బురువు ♦ లంచు వెసం గొనిపోయి పొంత శృం
గార వనద్రుమాళి ♦ గిజిగాడులు గూడులఁ జేర్చు దీపికల్
గా రహిఁ గృష్ణరాయ మహి♦కాంతుని శాత్రవ పట్టణంబులన్ 36

సీ. తొలుదొల్త నుదయాద్రి ♦ శిలఁదాఁకి తీండ్రించు నసిలోహమున వెచ్చ ♦ నయి జనించె
మఱి కొండవీ డెక్కి ♦ మార్కొని నలియైన, యలకసవాపాత్రు ♦ నంటి రాఁజె
నటుసాగి జమ్మిలో ♦ యఁ బడి వేగ దహించె, గోలబిట్టేర్చె గొ♦ట్టానఁ దగిలెఁ
గనకగిరిస్ఫూర్తిఁ ♦ గరఁచె గౌతమిఁ గ్రాఁచె, నవుల నాపొట్నూర ♦ రవులుకొనియె

గీ. మాడెములు ప్రేల్చె నొడ్డాది ♦ మసియొనర్చెఁ, గటకపురిఁ గాల్చె గజరాజు ♦ గలఁగిపఱవ
దోఁకచిచ్చన నౌర యు♦ద్ధురత గృష్ణ, రాయ బాహుప్రతాప జా♦గ్రన్మహాగ్ని. 37

మ. ధరకెంధూళులు కృష్ణరాయల చమూ♦ధాటీ గతి న్వింధ్య గ
హ్వరముల్ దూఱఁగఁజూచి తాఁరచటఁ గ్రాఁ♦పై యుండుటం జాల న
చ్చెరువై యెల్లని వింత చీకటులు వ♦చ్చెం జూడరే యంచు వే
సారిదిం జూతురు వీరరుద్ర గజరా♦ట్శుద్ధాంత ముగ్ధాంగనల్. 38

చ. అభిరతి కృష్ణరాయఁడు జ♦యాంకములన్ లిఖియించి తాళస
న్నిభముగఁ బొట్టునూరి కడ ♦ నిల్పిన కంబము సింహభూధర
ప్రభు తిరునాళ్ళకుం దిగు సు♦రప్రకరంబు కళింగ మేదినీ
విభు నపకీర్తి కజ్జలము ♦ వేమఱుఁ బెట్టి పఠించు నిచ్చలున్. 39

మహాస్రగ్ధర

ఎకరాలన్ మందావాసా♦హిణముల గల భ♦ద్రేభసందోహ వాహ
ప్రకరంబుం గొంచుఁ దత్త♦త్ప్రభువులు వనుపన్ ♦ రాయబారుల్ విలోకో
త్సుకులై నిత్యంబు శ్రీకృష్ణు♦ని యవసరముల్ ♦ చూతురందంద కొల్వుం
దక యా ప్రత్యూష మాసం♦ధ్యము పనివడి త♦న్మందిరాళిందభూమిన్. 40

చ. మదకల కుంభికుంభనవ♦మౌక్తికముల్ గనుపట్టు దట్టమై
వదలక కృష్ణరాయ కర♦వాలమునం దగుధార నీట న
భ్యుదయము నొంది శాత్రవుల ♦ పుట్టి మునుంగఁగ ఫేనపంక్తితోఁ
బొదిగొని పై పయిన్ వెడలు ♦ బుద్బుద పంక్తులు వోలెఁ బోరులన్. 41

సీ. వేదండ భయదకుం♦డాదండ నిర్యాంతమదధునుల్ పైఁ జిలుకు ♦ వారిగాఁగఁ
దత్కర్ణ విస్తీర్ణ ♦ తాళవృంతోద్ధూత ధూళి చేటులఁ జల్లు ♦ దుమ్ముగాఁగఁ
శ్రీమదుర్వరతురం♦గమనాసికాగళత్ఫేనకంబు పైచుక♦ర్దమము గాఁగఁ
గుపితయోధాత్మక్షిప్త♦కుంతకాంతార ఖేలనములు దండఘ♦ట్టనలు గాఁగఁ

గీ. జెనఁటి పగఱప్రతాపంబు♦చిచ్చులార్చు, కరణి గడిదేశములు చొచ్చి♦కలఁచి యలఁచు
మూరురాయర గండాంక ♦ వీరకృష్ణ, రాయ భూభృద్భయంకర ♦ ప్రబలధాటి. 42

షష్ఠ్యంతములు

క. ఏవంవిధ గుణవంతున, కావల్గత్తుంగ బహువి♦ధారోహ కళా
రేవంతున కతికాంతున, కావిష్కృతకీర్తి ధవళి♦తాశాంతునకున్. 43

క. పుంఖానుపుంఖ సైంధవ, రింఖా సంఘాతజాత ♦ రేణూగ్రతమో
రింఖదరిపు నృపదహార, ప్రేంఖదసుగ్రసనజఠర ♦ భృత్యాసి ఫణికిన్. 44

క. అవిరళ వితరణ విద్యా, నవరాధేయునకు సజ్జన విధేయునకున్
కవితా స్త్రీలోలునకున్, భువిటంకనటద్యశోబ్ధి కల్లోలునకున్. 45

క. దిగధీశ సహ్య ధగ, ద్ధగితేద్ధరుచి ప్రతాప తపన స్ఫురణ
స్థగితద్యుమణికి నిమిష, ద్ధగగృహీత కళింగరాజ తనయాగ్రణికిన్. 46

క. కరుణాకర వేంకటవిభు, చరణ స్మరణ ప్రసంగ సంగతమతి కీ
శ్వర నరసింహ మహీ భృ, ద్వరనందన కృష్ణరాయ ధరణీపతికిన్. 47

## కథాప్రారంభము

వ. అభ్యుదయ పరం పరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన స్వారోచిష మనుసంభవంబను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన జైమిని మునిస్వాయంభువమను కథా శ్రవణానంతరంబున మీఁద నెవ్వండు మనువయ్యె నెఱింగింపు మనవుఁడుఁ బక్షులు మార్కండేయుండు క్రోష్టికిం జెప్పిన ప్రకారంబున నిట్లని చెప్పందొడంగె. 48

మ. వరణా ద్వీపవతీ తటాంచలమునన్ వప్రస్థలీ చుంబితాం
బరమై సౌధసుధాప్రభాధవళిత ప్రాలేయరుఙ్మండలీ
హరిణంబై యరుణాస్పదం బనఁగ నార్యావర్త దేశంబునన్
బుర మొప్పున్ మహికంఠహార తరళస్ఫూర్తి న్విడంబించుచున్. 49

సీ. అచటి విప్రులు మెచ్చ రఖిల విద్యాప్రౌఢి, ముదిమది దప్పిన మొదటివేల్పు
నచటి రాజులు బంటు నంపి భార్గవు నైన, బింకాన గెలిపింతు రంకమునకు
నచటి మేటికిరాటు లలకాధిపతి నైన, మును సంచి మొదలిచ్చి మనుప దక్షు
లచటి నాలవజాతి హలముఖాత్తవిభూతి, నాదిభిక్షువు భైక్షమైన మాన్చు

గీ. నచటి వెలయాండ్రు రంభాదులైన నొరయఁ, గాసెకొంగున వారించి కడపఁగలరు
నాట్యరేఖా కళాధురంధర నిరూఢి, నచటఁ బుట్టిన చిగురుఁ గొమ్మైన చేవ. 50

ఉ. ఆ పురిఁ బాయకుండు మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి భా
షా పరశేష భోగి వివిధాధ్వర నిర్మల ధర్మ కర్మ దీ
క్షా పరతంత్రుఁ డంబురుహ గర్భ కులాభరణం బనారతా
ధ్యాపన తత్పరుండు ప్రవరాఖ్యుఁ డలేఖ్యతనూ విలాసుఁడై. 51

ఆ. వాని చక్కఁదనము వైరాగ్యమునఁ జేసి, కాంత సేయు వార కామినులకు
భోగ బాహ్యమయ్యెఁ బూచిన సంపెంగ, పొలుపు మధుకరాంగనలకు బోలె 52

ఉ. యౌవనమందు యజ్వయు ధనాఢ్యుఁడునై కమనీయ కౌతుక
శ్రీవిధిఁ గాఁకటూల్ గొలిచి చేసిన కూరిమి సోమిదమ్మ సౌ
ఖ్యావహయై భజింప సుఖియై తలితండ్రులు గూడి దేవియున్.
దేవరవోలె నుండి యుల దీర్పఁగఁ గాపుర మొప్పు వానికిన్. 53

సీ. వరణా తరంగిణీ ♦ దర వికస్వరసూత్న, కమలకషాయగం♦ధము వహించి
ప్రత్యూష పవనాంకు♦రములు పైకొను వేళ, వామనస్తుతి పర♦త్వమున లేచి
సచ్ఛాత్రుఁడగుచు ని♦చ్చలు నేఁగి యర్యోట, నఘమర్షణస్నాన ♦ మాచరించి
సాంధ్యకృత్యముఁ దీర్చి ♦ సావిత్రి జపియించి, సైకతస్థలిఁ గర్మ♦సాక్షి కెఱఁగి

గీ. ఫల సమిత్కుశ కుసుమాది ♦ బహుపదార్థ,తతియు నుడికిన మడుఁగు దో♦వతులఁ గొంచు
బ్రహ్మచారులు వెంటరా ♦ బ్రాహ్మణుండు, వచ్చునింటికిఁ బ్రజ దన్ను ♦ మెచ్చి చూడ.

శా. శీలంబుం గులమున్ శమంబు దమముం ♦ జెల్వంపు లేఁబ్రాయమున్
బోలం జూచి యితండు పాత్రుఁడని యే ♦ భూపాలుఁడీ వచ్చినన్
సాలగ్రామము మున్నుగాఁ గొనఁడు మా ♦ న్య క్షేత్రముల్ వెక్కు చం
దాలం బండు నొకప్పుడుం దఱుఁగదిం ♦ టం బాఁడియుం బంటయున్. 55

తే. వండ నలయదు వేవురు ♦ వచ్చిరేని, నన్నపూర్ణకు సుద్ది యా ♦ నతని గృహిణి
నతిథులే తేర నడిరే♦యైన బెట్టు, వలయు భోజ్యంబు లింట న♦వారిగాఁగ. 56

సీ. తీర్థసంవాసు లే♦తెంచినారని విన్న, నెదురుగా నేఁగు ద♦వ్వెంతయైన
నేఁగి తత్పదముల♦ కెఱఁగి యింటికి దెచ్చుఁ, దెచ్చి సద్భక్తి నా♦తిథ్యమిచ్చు.
నిచ్చి యిష్టాన్న సం♦తృప్తులఁ గాఁ జేయుఁ, జేసి కూర్చున్నచోఁ ♦ జేరవచ్చు
వచ్చి యిద్ధరఁ గల్గు ♦ వనధి పర్వతసరి, త్తీర్థ మాహాత్మ్యముల్ ♦ తెలియ నడుగు

గీ. నడిగి యోజన పరిమాణ ♦ మరయు నరసి, పోవలయుఁ జూడ ననుచు నూ♦ర్పులు నిగుడ్చు
ననుదినము తీర్థ సందర్శ♦నాభిలాష, మాత్మ నుప్పొంగ నత్తరు♦ణాగ్నిహోత్రి. 57

క. ఈవిధమున నభ్యాగత, సేవా పరతంత్రి సకల♦జీవనుఁడయి భూ
దేవ కుమారకుఁ డుండన్, గా విను మొకనాఁడు కుతప♦కాలమునందున్, 58

సీ. మడిచిన యొంటికెం♦జడ మూఁపు మవ్వాన్నె, మెగము తోలు కిరీట♦ముగ ధరించి
కకపాల కేదార♦కటకముద్రిత పాణిఁ, గురుచలాతాముతోఁ ♦ గూర్చి పట్టి
యైణేయమైన యొ♦డ్డాణంబు అవణిచే, నక్కళించిన పొట్ట ♦ మక్కళించి
యూరకూటచ్ఛాయ ♦ నవఘళింపఁగ జాలు, బడుగు దేహంబున ♦ భస్మ మలఁది

గీ. మిట్ట యురమున నిడు యోగ♦పట్టె మెఱయఁ, జెవుల రుద్రాక్ష పోగులు ♦ చవుకళింప
గావికుబుసంబు జలకుండి♦కయును బూని, చేరె తద్గేహ మౌషధ ♦ సిద్ధుఁ డొకఁడు. 59

తే. ఇట్లు చనుదెంచు పరమయో♦గీంద్రుఁ గాంచి, భక్తిసంయుక్తి నెదురేగి ♦ ప్రణుతుఁడగుచు
నర్ఘ్యపాద్యాది పూజనం ♦ బాచరించి, యిష్టమృష్టాన్న కలన సం♦తుష్టుఁ జేసి. 60

క. ఎందుండి యెందుఁ బోవుచు, నిందుల కేతెంచినార ♦ లిప్పుడు విద్వ
ద్వందిత నేఁడుగదా మ,న్మందిరము పవిత్రమయ్యె ♦ మాన్యుఁడ నైతిన్. 81

క. మీ మాటలు మంత్రంబులు, మీ మెట్టినయెడఁ బ్రయాగ ♦ మీ పాద పవి
త్రామలతోయము లలఘు, ద్యోమార్గధురాంబుపాన ♦ రక్త్యము లర్థిన్. 62

ఉ. వానిది భాగ్యవైభవము ♦ వానిది పుణ్యవిశేష మిమ్మెయిన్
వాని దవంధ్య జీవనము ♦ వానిది జన్మము వేయునేయ కె
వ్వాని గృహాంతరంబున భవాదృశ యోగిజనంబు పావన
స్నాన విధాన్న పానముల ♦ సంతసమందుచుఁ బోవు నిచ్చలున్. 63

తే. మానినాథ కుటుంబజంబాలపటల, మగ్నమాదృశ గృహమేధి ♦ మండలంబు
నుద్ధరింపంగ నౌషధ ♦ మొండుగలదె, యుష్మదంఘ్రి రజోలేశ ♦ మింకటిదక్క. 64

క. నావిని ముని యిట్లను వత్సా విను మావంటి తైర్థికావళి కెల్లన్
మీవంటి గృహస్థుల సుఖ, జీవనమునఁ గాదె తీర్థ ♦ సేవయుఁ దలపన్. 65

సీ. కలఁకలనున్న తంగటిజున్ను గృహమేధి, యజమానుఁ డంకస్థితార్థపేటి
పండిన పెరటికల్పకము వాస్తవ్యుండు, దొడ్డిఁ బెట్టిన వేల్పు ♦ గిడ్డికాఁపు
కడలేని యమృతంపు ♦ నడఁబావి సంసారి, సవిధమేరునగంబు ♦ భవనభర్త
మరుదేశ పథమధ్య ♦ మహాప్రప కులపతి, యాకటి కొదవుసస్యము కుటుంబి
తే. బధిర పంగ్వంధ భిక్షుక ♦ బ్రహ్మచారి, జటి పరివ్రాజ కాతిథి ♦ క్షపణ కావ
ధూత కాపాలి కాద్యనాథులకుఁ గాన, భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె. 66

క. నావుఁడు బ్రవరుం డిట్లను, దేవా! దేవర సమస్త ♦ తీర్థాటనముం
గావింపుదు రిలపై నటు, గావున విభజించి యడుగఁ ♦ గౌతుకమయ్యెన్. 67

శా. ఏయే దేశములన్ వసించితిరి మీ ♦ రేయే గిరుల్ చూచినా
రేయే తీర్థములందుఁ గ్రుంకిడితి ♦ రేయే ద్వీపముల్ మెట్టినా
రేయే పుణ్యవనాళిఁ ద్రిమ్మరితి ♦ రేయే తోయధుల్ డాసినా
రాయా చోటులఁ గల్గువింతలు మహాత్మా నా కెఱింగింపరే. 68

తే. పోయి సేవింపలేకున్న ♦ పుణ్యతీర్థ, మహిమ వినుటయు నఖిల కల్మష హరంబు
కాన వేఁడెద ననిన నమ్మౌనివర్యుఁ, డాదరాయత్తచిత్తుఁడై ♦ యతనికనియె. 69

ఉ. ఓ చతురాస్య వంశ కలశోదధి పూర్ణశశాంక! తీర్థయా
త్రాచణ శీలినై జనపదంబులు పుణ్య నదీ నదంబులుం
జూచితి నందు నందుఁగల ♦ చోద్యములం గనుఁగొంటి నా పటీ
రాచల పశ్చిమాచల హిమాచల పూర్వ దిశాచలంబులన్. 70

శా. కేదారేశు భజించితిన్ శిరమునన్ ♦ గీలించితిన్ హింగుళా
పాదాంభోరుహముల్ ప్రయాగ నిలయుం ♦ బద్మాక్షు సేవించితిన్
యాదోనాథ సుతా కళత్రు బదరీ ♦ నారాయణుం గంటి నీ
యా దేశం బననేల చూచితి సమస్తాశావకాశంబులన్. 71

వ. అది యట్లుండె వినుము గృహస్థరత్నంబ! లంబమాన రవి రథ తురంగ శృంగారచారు చామరచ్ఛటా ప్రేక్షణ క్షణోద్దీప్త చమరీ సముదయంబగు నుదయంబునం గల విశేషంబులు శేష ఫణికైనన లెక్కింప శక్యంబె? అంధకరిపు కందరావాస వాసుకి వియోగ భవదుర్వ్యథా భోగభోగినీ భోగభాగపరివేష్టిత పటీరవిటపి వాటికా వెల్లదేలా లతావలయం బగు మలయంబునం గల చలువకు విలువ యెయ్యది? అకటకట! వికటకూట కోటి విటంక శృంగాటకా ఢౌకమానజరదిందుబింబగళ దమృతబిందు దుర్దినార్ద్రీకృత సల్లకీపల్లవ ప్రభంజన పరాంజన హస్తిహస్తంబగు నస్తంబునం గల మణిప్రస్తరంబుల నిక్రాంతిం జెంతించిన మేనం బులకలిప్పుడుం బొడమెడు స్వస్వప్రవర్తిత వర్తిష్ణు ధరణీరుహసందోహ సౌహృద ప్రధానాపమాన ఖేలద్దైలబిలవిలాసినీ విలాస వాచాల తులాకోటి కలకలాహూయమాన మానస మదాల సమరాళంబగు రజతశైలంబు నోలంబులంగాలగొను విహార ప్రదేశంబులం గన్న సంసృతి క్లేశంబులు వాయవే? సతత మదజల స్రవణపరాయణైరావణ విషాణకోటి సముట్టంకిత కటకపరిస్ఫురత్కురువింద కందళవ్రాత జాతాలాతశంకాపసర్పదభ్రమభ్రమ విభ్రమ ధురంధరం బగు మేరుధరాధరంబు శిఖరంబుల సోయగంబులం గలయం గనుంగొనుట బహుజన్మకృత సుకృత పరిపాకంబునం గాక యేల చేకూర నేర్చు? నే నిట్టి మహాద్భుతంబు నీశ్వరానుగ్రహంబున నల్పకాలంబునం గనుంగొంటి ననుటయు నీషదంకురితహాసన గ్రసిష్ణు గండయుగళుండగుచుం బ్రవరుం డతని కిట్లనియె. 72

చ. వెలువడి మీ కొనర్తు నొక ♦ విన్నప మిట్టివి యెల్లఁ జూచి రా
నెలకలు గట్టుకొన్న మతి ♦ యేండ్లును బూండ్లును బట్టుఁ బ్రాయపుం
జెలుతతనంబు మీ మొగము ♦ సెప్పక చెప్పెడు నద్దిరయ్య! మా
కెలుఁగఁ దరంబె మీ మహిమ ♦ లీర యెఱుంగుదు రేమి చెప్పుదున్. 73

క. అనినఁ బరదేశి గృహపతి, కనియెన్ సందియముఁ దెలియ ♦ నడుగుట తప్పా?
వినవయ్య జరయు రుజయును, జెనకంగా వెఱచు మమ్ము ♦ సిద్ధుల మగుటన్. 74

మ. పరమంబైన రహస్యమౌ నయిన డాపం జెప్పెదన్ భూమిని
ర్జరవంశోత్తమ! పాదలేప మను పేరం గల్గు దివ్యౌషధం
పు రసం బీశ్వర సత్కృపం గలిగెఁ దద్భూరి ప్రభావంబునం
జరియింతుం బవమానమానస తిరస్కారిత్వరాహంకృతిన్. 75

క. దివి బిసరుహ బాంధవ సైంధవ సంఘం బెంతదవ్వు ♦ దగ నే కరుగన్
భువి నంత దవ్వు నేమును, రవరవతే కరుగుదుము హాటాహుటి నడలన్. 76

మ. అనిన న్విప్రవరుండు కౌతుకభర ♦ వ్యగ్రాంతరంగుండు భ
క్తిని బద్ధాంజలి బంధురుండునయి ♦ మీ దివ్య ప్రభావం బెఱుం
గని నా ప్రల్లదముల్ సహించి మునిలోకగ్రామణీ! సత్కృపన్
నను మీ శిష్యునిఁ దీర్థయాత్రవలనన్ ♦ ధన్యాత్ముఁగాఁ జేయరే. 77

క. అనుటయు రసలింగము నిడు; తన వటుప్రక్షేపసజ్జ ♦ దంతఁపు బరణిన్
నినిచిన యొక పసరిది యదిఁ, యని చెప్పక పూసెఁ బత్ప ♦ దాంబుజ యుగళిన్. 78

క. ఆ మందిడి యతఁ డరిగిన, భూమిసురుం డరిగెఁ దుహిన ♦ భూధర శృంగ
శ్యామల కోమల కానన, హేమాద్య్రదరీఝరీ ని♦రీక్షాపేక్షన్. 79

వ. అనిన విని యయ్యగ్రహారవరుం డత్తుంగగిరి యెట్లు పరివర్తించె నతని పుణ్యవర్తన శ్రవ
ణంబు మనంబునకు హర్షోత్కర్షంబు కల్పించెఁ దదాగతి వృత్తాంతంబు కృపాయత్త
చిత్తంబున నానతీయఁగలయది యని యడుగుటయును. 80

శా. గంగాస్వచ్ఛతరంగభంగిక యశో ♦ గాఢచ్ఛ విచ్ఛన్న సా
రంగాంక నిరంకుశ ప్రతికళా ♦ ప్రౌఢిప్రియంభావుకా
గాంగేయాచల చాపనూపుర వచో ♦ గాంభీర్య లీలాస్పదా
బంగాళాంగ కళింగ భూప సుభటా♦భ్రశ్రేణి ఝంఝానిలా. 81

క. మండలిక తపనశోభిత, కుండలిపతిశయన కర్ణ♦కుండలి తరసా
ఖండ కవికావ్య దిగ్వే, దండకృతి దళనకలహ ♦ తాడితపటహా. 82

ఉ త్సా హ ము.

కుకురకాశ కురుకరూశ ♦ కోసలాంధ్ర సింధు బా
హ్లీక శకాంగ వంగ సింహ♦ళేశ కన్యకామణి
ప్రకరపాణిఘటిత రత్న♦పాదుకా కలాచికా
ముకుర వీటికాకరండ ♦ మాఖ్యరాజలాంఛనా. 83

ఇది శ్రీమదాంధ్ర కవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్ష
పాదాంబుజాధీన మానసేందిందిర నందవరపుర వంశోత్తంస
శఠకోపతాపస ప్రసాదాసాదిత చతుర్విధకవితామతల్లి
కాల్లసాని చొక్కయామాత్యపుత్ర పెద్దనార్య
ప్రణీతంబయిన స్వారోచిషమనుసంభవం
బను మహాప్రబంధమునందుఁ
ప్రథమాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ

# స్వారోచిష

# మను చరిత్రము

## ద్వితీయాశ్వాసము

శ్రీఖండ శీత నగమ,
ధ్యాఖండ క్షోణి మండ◆లాఖండల వి
ద్యాఖేలన భోజ సుధీ,
లేఖద్రుమ కృష్ణరాయ ◆ లీలా మదనా. 1

వ. అవధరింపుము. జైమిని మునీంద్రునకుం బ్రజ్ఞాసాంద్రంబు లగు పక్షీంద్రంబు లవ్వలి కథ యిట్లని చెప్పం దొడంగె. 2

ఉ. అటఁ జని కాంచె భూమిసురుఁ ◆ డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠద ◆ భంగతరంగ మృదంగ నిస్స్వన
స్ఫుటనటనానురూప పరి◆ఫుల్లకలాపకలాపి జాలముం
గటకచరత్కరేణు కర◆కంపితసాలము శీతశైలముం. 3

వ. కాంచి యంతరంగంబునఁ దరంగితంబగు హర్షోత్కర్షంబున. 4

క. నరనారాయణ చరణాం,బురుహ ద్వయ భద్ర చిహ్న ◆ ముద్రిత బదరీ
తరుషండ మండలాంతర, సరణిన్ ధరణీసురుండు ◆ సనఁ జన నెదుటన్. 5

క. ఉల్లలదలకాజలకణ, పల్లవిత కదంబముకుళ ◆ పరిమళలహరీ
హల్లోహల మదబంభర, మల్లధ్వను లెసఁగ విసరె ◆ మరుదంకురముల్. 6

సీ. తోఁడేములాఁచి యం◆దుకఁ జుసుళ్లకు నిక్కు, కరులదంతచ్ఛాయ ◆ గడలు గానఁగ
సెలవుల వనదంశ◆మాలలు మూఁగి నెఱవెట్టఁ, గ్రోల్పులు లొప్పదరిండ్ల ◆ గుటుక లిడఁగ
సెలయేటి యిసుకలం ◆ గలవరాహంబులు, మొత్తమ్ములై త్రవ్వి ◆ మూస్తె లెత్త
నడ్డంబు నిడుపు నా ◆ పడ్డలగతిమను, బిల్లి డొంకలనుండి ◆ శిల్లి దాఁట

గీ. ప్రబల భల్లూకనఖభల్ల◆భగ్నదమథన, శిథిల మధుకోశవిసరవి◆శీర్ణమక్షి
కాంతరాంతర దంతురి◆తాతపమునఁ, బుడమి తిలతండుల న్యాయ◆మున వెలుంగ. 7

క. పరికించుచు నెందంబునఁ, బురికొను కౌతుకము తోడ ◆ భూమీసురుఁ డ
గ్గిరికటకతట నిరంతర, తరు గహన గుహావిహార ◆ తత్పరమతియై. 8

సీ. నిడుద పెన్నెఱి గుంపు ♦ జడగట్ట సగరు ము,మ్మనుమండు తపముఁ గై♦కొనిన చోటు
జరఠ కచ్ఛప కులే♦శ్వరు వెన్ను గాన రా, జగతికి మిన్నేరు ♦ దిగినచోటు
పుచ్చడీ కతనంబు ♦ పోఁబెట్టి గిరికన్య, పతిఁగోర్వ నాయాస♦పడిన చోటు
వలరాచరాచవాఁ♦డలి కాఁక కనువెచ్చఁ, గరగిన యలకని ♦ కరఁపు జోటు

గీ. తపసియిల్లాండ్రు చెలువంబు ♦ దలఁచితలఁచి, మున్ను ముచ్చిచ్చునవిరాలి ♦ గొన్నచోటు
కనుపవులు వేల్పుఁబడవాలుఁ ♦ గన్నచోటు, హర్షమునఁ జూచి ప్రవరాఖ్యు♦డాత్మలోన

చ. విలయ కృశానుకీలముల ♦ వేఁడిమి బోడిమి తూలి కెల్మిడిన్
గలసిన భూతధాత్రి మఱి ♦ క్రిమ్మర రూపయి నిల్చి యోషధుల్
మొలవఁగఁ జేయునట్టి నయ♦ముం బ్రకటమ్ము నెట్లు గాంచు నీ
చలిమలవల్ల నుల్లసిలుం ♦ జల్లఁదనంబును నూనకుండినన్. 10

సీ. పసుపు నిగ్గులు దేఱు ♦ పాఁపజన్నిద మొప్పఁ, బ్రమథాధిపతి యింటి ♦ పట్టెలింగ
శచి కీర్తిఁ గఱపుచు ♦ జదలేట సురరాజు, జలకేళి సవరించు ♦ చెలువు వెలింగ
వదనుతోఁ జేఁపి చ♦న్నవిసి యోషధుల మ,న్నొదవు కొండలకెల్లఁ ♦ బిదుక నెఱిఁగ
వేల్పు టింతులలోన ♦ విఱ్ఱవీఁగుచు మేన, నవరత్న రచనల ♦ ఱవణ మెఱిఁగఁ

గీ. బరిపరి విధంపు జన్నంపుఁ ♦ బరికరంపు, సొంపు సంపద నిఖిల ని♦లింప ప్రభయు
నప్పటప్పటికిని జిహ్వ ♦ తుప్పుదుల్ల, నా మెఱ లెఱింగ నీకుమా♦రాద్రి కతన. 11

మ. తరమే బ్రహ్మకునైన నీ నగ♦మహత్త్వం బెన్న నే నియ్యెడం
గల చోద్యంబులు రేపు గన్గొనియెదం ♦ గాకేమి నేఁ డేఁగెదన్
నళినీబాంధవ భాను తప్త రవికాం♦తస్యంది నీహారకం
దళ చామీకర పంక్తిఁ బయిపయిన్ ♦ మధ్యాహ్నముం దెల్పెడిన్. 12

గీ. అనుచుఁ గ్రమ్మరువేళ నీ♦హారవారి, పెరసి తత్పాద లేపంబు ♦ గరఁగిపోయెఁ
గరఁగి పోవుట యెఱుఁగఁడా ♦ ధరణిసురుఁడు, దైవకృతమున కిల న♦సాధ్యంబు గలదె.

మ. అతఁ డల్లౌషధహీనుఁడై నిజపురీ♦యాత్రామిళత్త్వరతో
ద్ధతిఁ బోవన్ సపదిస్ఫుటార్తిఁ జరణ♦ద్వంద్వంబు రాకుండినన్
మతిఁ జింతించుచు నవ్విధం బెఱిఁగి హా ♦ నన్నిట్లు దైవంబ తె
చ్చితె యీ ఘోర వనప్రదేశమునకున్ ♦ సిద్ధాపదేశంబునన్. 14

క. ఎక్కడి యరుణాస్పదపుర?, మెక్కడి తుహినాద్రి? క్రిమ్మ ♦ యే రాఁదగునే?
యక్కట! మును సనుదెంచిన, దిక్కిదియని యెఱుఁగ వెడలు ♦ తెరువెయ్యదియో 15

మ. అకలంకాద్భుత సత్త్వముం దెలియ మా♦యాద్వార కావంతి కా
శీ కురుక్షేత్ర గయా ప్రయాగములు నే ♦ సేవింప నుద్దండ గం
డక వేదండ వరాహ వాహరిపు ♦ ఖడ్గవ్యాఘ్ర సింహంబులం గొం
డల రాఁ జెల్లనె బుద్ధిజాడ్య జనితో♦న్మాదుల్ గదా శ్రోత్రియుల్. 16

సీ. నను నిమసంబు గావకయున్న నూరెల్ల, నరయ మజ్జనకుఁ డెంతడలు నొక్కొ
యెపుడు సంధ్యలయందు నిలువ వెళ్లనీక న,న్నోమెడు తల్లి యెంతొరలు నొక్కొ
యనుకూలవతి నాదు మనసులో వర్తించు, కులకాంత మది నెంత కుందునొక్కొ
గడఁదోడు నీడలై క్రీడించు సచ్ఛాత్రు, లింతకు నెంత చింతింతు రొక్కొ
గీ. యతిథి సంతర్పణంబు లేమయ్యె నొక్కొ, యన్ను లేమయ్యెనొక్కొ నిత్యంబులైన
కృత్యములఁ బాపి దైవంబు కినుక నిట్లు, పారవైచితె మిన్నులు పడ్డచోట. 17
క. నను నిలుసేరు నుపాయం, బొనరింపఁగఁ జాలు సుకృతి యొకఁ డొదవఁ డొకో
యనుచుం జింతాసాగర,మున మునిఁగి భయంబు గదురఁ బోవుచు కెదురన్. 18

సీ. కులిశ ధారాహతి పాలుపునఁ బైనుండి, యడుగుమోపఁగ జేగురైన తటుల
గనుపట్టు లోయ గంగా నిర్ఝరము వాఱు, జలువయా నయ్యేటి కెలఁకు లందు
నిగుడ వెట్టిన నేల నేచి యర్కాంశులఁ, జొరనీక దట్టమై యిరులు గవియ
క్రముక పున్నాగ సారంగ రంభానాళి, కేరాది విటపి కాంతార వీధిఁ
గీ. గెరలు పిక శారికా కీర కేకి భృంగ, సార సధ్వనిఁ దనలోని చంద్రికాంత
దరులు ప్రతిశబ్దమీన గంధర్వ యుతి, గాన ఘూర్ణిత మగు నొక్క కోనఁ గనియె.
క. కనుగొని యిది మునియాశ్రమ, మను తహతహ నొడమి యిచటి కరగిన నాకుం
గనవగు నొక తెఱవు యని, మనమునఁగల దిగులు కొంత మట్టువడంగన్. 20
చ. నికట మహీధరాగ్ర తట నిర్గత నిర్ఝరధారఁ బాసి లో
యకుఁ దలక్రిందుగా మలఁకలై దిగు కాలువ వెంట బూచు మ
ల్లిక లవలంబనంబుగ నళిప్రకర ధ్వని చిమ్మ రేగ లో
నికి మణి పట్టుభంగ సరసిన్ ధరణీసురుఁ డేగి చెంగటన్. 21
శా. తావుల్ క్రేవలఁ జల్లు చెంగలువ కేదారంబు తీరంబునన్
మావుల్ క్రోవులు నల్లి బిల్లిగొను కాంతారంబునం దైందవ
గ్రావా కల్పిత కాయమాన జటిల ద్రాక్షా గుళుచ్ఛంబులం
బూవుం దీవెల నొప్పు నొక్క భవనంబుం గారుడోత్కీర్ణమున్. 22
క. కాంచి తదీయ విచిత్రతఁ, దంచిత సౌభాగ్య గరిమ కచ్చెరువడి య
క్కాంచన గర్భాన్వయమణి, యించుక దరియంగ నచటి కేగెడు వేళన్. 23
క. మృగమద సౌరభ విభవ, ద్విగుణిత ఘన సారసాంద్ర వీటీగంధ
స్థగితేతర పరిమళమై, మగువ పొలుపు దెలుపు నొక్క మారుత మొలసెన్. 24
మ. అతఁ డావాతపరంపరా పరిమళ వ్యాపార లీలన్ జనా
న్వితమిచ్చోటని చేరఁబోయి కనియెన్ విద్యుల్లతా విగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీక చికురం జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొక మరున్నారీ శిరోరత్నమున్. 25
తే. అమల మణిమయ నిజమంది రాంగణస్థ, తరుణ సహకార మూలవితర్దిమీఁద
శీతలానిల మొలయ నాసీనయైన, యన్నిలింపాబ్జముఖియు నయ్యవసరమున. 26

సీ. తతనితంబాభోగ ♦ ధవళాంశుకములోని, యంగదట్టపుఁ గావి ♦ రంగువలన
శశికాంతమణిపీఠి ♦ జాజువాఱఁగఁ గాయ, లుత్తుంగకుచపాళి ♦ నత్తమిల్లఁ
దరుణాంగుళీధూత ♦ తంత్రీస్వనంబుతో, జిలిబిలిపాట మూ♦ర్ఛలు నటింప
నాలాపగతిఁ జొక్కి ♦ యరమోడ్పుఁ గనుదోయి, రతిపారవశ్య వి♦భ్రమముఁ దెలుపఁ

గీ. బ్రౌఢిఁ బలికించు గీతప్ర♦బంధములకుఁ, గమ్రకరపంకరుహరత్న ♦ కటకఝుణఝు
ణధ్వని స్ఫూర్తి తాళమా♦నములు గొలుప, నింపు దళుకొత్త వీణ వా♦యించుచుండి. 27

ఉ. అబ్బురపాటుతోడ నయ♦నాంబుజముల్ వికసింపఁ గాంతి పె
ల్లుబ్బి కనీనికల్ వికసి♦తోత్పల పంక్తులఁ గ్రుమ్మరింపఁగా
గుబ్బమెఱుంగుఁ జన్గవ క♦గుర్పొడువ న్మదిలోనఁ గోరికల్
గుబ్బటిలంగఁ జూచె నల♦కూబర సన్నిభు నద్ధరామరున్. 28

ఉ. చూచి ఝళంఝళత్కటక ♦ సూచిత వేగ పదారవిందయై
లేచి కుచంబులుం దుఱుము ♦ లేనడు మల్లలనాడ నయ్యెడం
బూచిన యొక్కపోకనును ♦ బోదెఁ జేరి విలోకన ప్రభా
వీచికలం దదీయపద♦వీ కలశాంబుధి వెల్లిగొల్పుచున్. 29

మ. మనమునఁ బుట్టెడు కొంకులౌల్యము నిజేన్ ♦ మోదంబు విస్తీర్ణతం
జొనుపన్ గోర్కులు ద్రొక్కుడిప్ప మదిమె♦చ్చుల్ చెప్ప లల్లాగ్ప న
త్యనుషంగస్థితి తచ్చపాటొసఁగ నొ♦య్యారంబునం జంద్రికల్
దనుకం జూచె లతాంగి భూసురుఁ బ్ర♦ఫుల్ల న్నేత్రపద్మంబులన్. 30

క. పంకజముఖి కప్పుడు మై, నంకురితములయ్యెఁ బులక ♦ లావిష్కృతమీ
నాంకానల సూచక ధూ, మాంకురములఁ బోలె మతిసు ♦ నతనిం జూడన్ 31

ఉ. తొంగలిఱెప్పలం దొలఁగ ♦ ద్రోయుచుఁ బైపయి విస్తరిల్లు క
న్నుం గవ యాక్రమించు కొను♦నొ ముఖచంద్రు నటించుఁ బోవ నీ
కంగజుఁ డానవెట్టి కడి♦యన్ గుతివ్రాసె ననంగ జాతి సా
రంగమదంబు తేఁజమటఁ ♦ గ్రమ్మె లలాటము డిగ్గి చెక్కులన్. 32

మ. అని వేషస్థితి మాన్పె బిత్తరవు జా♦ప స్వేదతావృత్తి మా
న్పె నవస్వేదసమృద్ధి బోధకళ మా♦న్పెన్ మోహవిభ్రాంతి తో
డనె గీర్వాణ వధూటికిన్ భ్రమరకీ♦ట న్యాయమొప్పన్ మను
ష్యుని భావించుట మానుషత్వము మెయిం ♦ జూపట్టె నా నత్తఱిన్. 33

వ. ఇట్లతని రూపురేఖావిలాసంబులకుఁ జొక్కి యక్కమలపత్త్రేక్షణ యాత్మగతంబున. 34

ఉ. ఎక్కడివాఁడొ యక్షతన♦యేందు జయంత వసంతకంతులన్
జక్కఁదనంబునం గెలువఁ ♦ జాలెడివాఁడు మహీసురాన్వయం
బెక్కడ యీతనూవిభవ ♦ మెక్కడ యేలని బంటుగా మరుం
డక్కఁగొనంగ రాదె యక♦టా నను వీఁడు పరిగ్రహించినన్. 35

సీ. వదనపరిభూత లా♦వణ్యాంబుసంభూత, కమలంబులన వీని ♦ కన్నులమరు
నిక్కి వీనులతోడ ♦ నెక్కసక్కెములాడు, కరణి నున్నవి వీని ♦ ఘనభుజములు
సంకల్పసంభవ ♦ స్థానపీఠికవోలె, వెడఁదయై కనుపట్టు ♦ వీని యురము
ప్రతిఘటించు చిగుళ్ల ♦ పై సెట్టివాటిన, రీతి నున్నవి వీని ♦ మృదుపదములు
గీ. నేరెటేటియసల్ తెచ్చి ♦ నీరజాప్తు, సానఁబట్టిన రాపాడి ♦ చల్లి మెదిపి
పదను సుధనిడి చేసెనో ♦ పద్మభవుఁడు, వీనిఁ గాకున్నఁ గలఁదె యీ♦మేనికాంతి.

క. సుర గరుడోరగ నర ఖే,చర కిన్నర సిద్ధసాధ్య ♦ చారణ విద్యా
ధర గంధర్వ కుమారుల, నిరతము గనుఁగొనమె పోల♦నేర్తురె వీనిన్. 37

మ. అని చింతించుచు మీనకేతన ధను♦ర్జ్యాముక్త నారాచ దు
ర్దిన సమ్మూర్ఛిత మానసాంబురుహయై ♦ దీపించు నెం దత్తఱం
బునఁ జేపెట్టిన లజ్జ నంకుశికటకం♦బుల్ మెఱియ నడ్డంబు ని
ల్చిన నయ్యచ్చరఁ జూచి చేరఁ జనిప♦ల్కెన్ వాఁడు విభ్రాంతుఁడై 38

ఉ. ఎవ్వతె వీవు భీతహరి♦ణేక్షణ యొంటి చరించె దోటలే
కివ్వనభూమి భూసురుఁడ ♦ నే ప్రవరాఖ్యుఁడఁ ద్రోవ తప్పితిం
గ్రొవ్వున నిన్నగాగ్రమున♦కుం జనుదెంచి పురంబుఁ జేర నిం
కెవ్విధిఁ గాంతుఁ జెప్పఁగద♦వే తెరువెద్ది శుభంబు నీకగున్. 39

క. అని తన కథ నెఱిఁగించినఁ, దన కనుఁగవ మెఱుఁగులుబ్బ ♦ దాటంకములం
జనుఁగవయు నడుము వడఁకఁగ, వనిత సెలవివాలి నవ్వి ♦ వానికి ననియెన్. 40

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరు♦వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర! యే
కాంతమునందు నున్న జవ♦రాండ్ర నెపంబిడి పల్కరించు లా
గింతియకాక నీ వెఱుఁగ♦వే మును వచ్చిన త్రోవచొప్పు నీ
కింత భయంబు లేకడుగ ♦ నెల్లిదమైతిమి మాటలేటికిన్. 41

వ. అని నర్మగర్భంబుగాఁ బలికి క్రమ్మఱ నమ్మగువ యమ్మహీసురున కిట్లనియె. 42

సీ. చిన్ని వెన్నెలకందు ♦ వెన్నుదన్ని సుధాబ్ధిఁ, బొడమిన చెలువ తోఁ♦బుట్టు మాకు
రహిపుట్టు జంత్రగా♦త్రముల రాల్ గరగించు, విమల గాంధర్వంబు ♦ విద్య మాకు
పసవిల్తు శాస్త్రంపు ♦ మినుకులావర్తించు, పని వెన్నతోఁ బె♦ట్టినది మాకు
హయమేధ రాజసూ♦యములనఁ జేర్పడ్డ, సవనతంత్రంబు లుం♦కువలు మాకుఁ
గీ. గనకనగసీమఁ గల్పవృ♦క్షముల నీడఁ, బచ్చరాచట్టుగమి రచ్చ♦పట్టు మాకుఁ
పద్మసంభవ వైకుంఠ ♦ భర్గసభలు, సాముగరిడీలు మాకు గో♦త్రామరేంద్ర. 43

క. పేరు వరూథిని విప్రకు,మార ఘృతాచీ తిలోత్త♦మా హరిణీ హే
మా రంభా శశిరేఖలు, దారగుణాఢ్యలు మదీయ♦లగు ప్రాణసఖుల్. 44

మ. బహురత్నద్యుతి మేదురోదరదరీ ♦ భాగంబులం బొల్చు ని
మ్మహికాహార్యమునం జరింతు మెపుడున్ ♦ ప్రేమన్నభో వాహినీ
లహరీ శీతలగంధవాహ పరిఖే♦ల న్మంజరీ సౌరభ
గ్రహణేందిందిర తుందిలంబు లివి మ ♦ త్కాంతార సంతానముల్. 45

క. భూసుర కైతవ కుసుమ శరాసన ! మా యింటి విందవై తివి గైకొ
మ్మా సముదంచ న్మణిభవ, నాసీనత సేదదేఱి ♦ యాతిథ్యంబున్. 46

తే. కుందనము వంటి మేను మ♦ధ్యందినా తపోష్మహతిఁ గందె వడదాఁకెఁ గన్నొప్పులొలుకు
వదన మస్మద్గృహంబు పా♦వనము సేసి, బడలికలు వాసి చనుమన్న ♦ బ్రాహ్మణుండు.

ఉ. అండజయాన నీ వొసగు ♦ నట్టి సపర్యలు మాకు వచ్చె నిం
డుండఁగరాదు పోవలయు ♦ నూరికి నింటికి నిప్పుడేను రా
కుండ నొకండు వచ్చి మతి♦నొందునె ? భక్తియ చాలు సత్క్రియా
కాండముఁ దీర్పవేగ చనఁ♦గావలయుం గరుణింపు నాపయిన్. 48

ఉ. ఏ నిఁక నిల్లు సేరుటకు ♦ నెద్ది యుపాయము మీ మహత్త్వము
ల్మానిని దివ్యముల్ మదిఁ ద♦లంచిన సెందును మీ కసాధ్యముల్
గానము గాన తల్లి ప్రజ♦లన్ ననుఁ గూర్పుమటన్న లేఁతన
వ్వాననసీమఁ దోఁప ధవ♦ళాయతలోచన వాని కిట్లనున్. 49

ఉ. ఎక్కడి యూరు కాల్ నిలువ ♦ కింటికిఁ బోయెదనంచుఁ బల్కె దీ
వక్కట మీ కుటీర నిల♦యంబులకున్ సరిరాశ పోయెనే
యిక్కడి రత్నకందరము ♦ లిక్కడి నందన చందనోత్కరం
బిక్కడి గాంగసైకతము ♦ లిక్కడి యీ లవలీనికుంజముల్. 50

ఉ. నిక్కము దాపనేల ధర♦ణీసురనందన యింక నీ పయిం
జిక్కె మనంబు నాకు ననుఁ ♦ జిత్తజుబారికి నప్పగించెదో
చొక్కి మరందమద్యముల ♦ చూఱలఁ బాటలు వాడు తేంట్ల సాం
పెక్కిన యట్టి పూవుఁబొద ♦ రిండ్లను గౌఁగిట గారవించెదో. 51

క. అనుటయుఁ బ్రవరుం డిట్లను, వనజేక్షణ యిట్లు పలుక ♦ వరుసయె వ్రతులై
దినములు గడపెడు విప్రులఁ, జనునే కామింప మది వి♦చారము వలదే. 52

ఉ. వేలిమియుం సురార్చనయు ♦ విప్ర సపర్యయుఁ జిక్కె భుక్తికిన్
వేళ యతిక్రమించె జన♦నీ జనకుల్ కడు వృద్ధు లాకటన్
సోలుచుఁ జింతతో నెదురు ♦ సూచుచు నుండుదు రాహితాగ్ని నేఁ
దూలు సమస్తధర్మములుఁ ♦ దొయ్యలి నేఁ డిలు సేరకుండినన్. 53

ఉ. నావుడు విన్నఁబాటు వద♦నంబున నించుక దోఁప బల్కె నో
భావజరూప యిట్టి యొల♦ప్రాయము వైదికకర్మ నిష్ఠలం
బోవఁగ నింక భోగములఁ ♦ బొందుట యెన్నఁడు యజ్ఞకోటులం
బావను లౌటకు న్ఫలము ♦ మా కవుఁగిళ్ల సుఖించు టేకదా. 54

సీ. పదోన్మేషనిర్భిన్న ♦ సారంగనాభి కా,హ్వాతమైపి సాళించు ♦ మృగమదంబు
కసటువో బీజేఁడఁ ♦ గరఁగి కర్బూలనంటి, గమగమ వలచు జో ♦ కంపు జవాజి
పారలెత్తి ఘనసార ♦ తరువులఁ దనుఁ దాన, తొరఁగిన పచ్చక ♦ ప్పూరపు సిరము
గోజంగి పూఁబొదల్ ♦ గురియంగఁ బటికంపు, దొనర నిండినయట్టి తుహినజలము

గీ. వివిధ కుసుమకదంబంబు ♦ దివిజతరుజ, మృదులవసన ఫలాసవా ♦ మేయరత్న
భూషణంబులుఁ గలవిందు ♦ భోగపరుడ, వయి రమింపుము నను గూడి ♦ యనుదినంబు.

క. అంధునకుఁ గొలరె వెన్నెల, గంధర్వాంగనల పొందు ♦ గాదని సంసా
రాంధువునఁ బడిరొ దకట! ద్విరాంధవమా వెలుఁగుఁగని గొంది ♦ నడఁగిన భంగిన్,

ఉ. ఎన్ని భవంబులం గలుగు ♦ నిక్షుశరాసనసాయకవ్యథా
ఖిన్నత వాడి వత్తలయి ♦ కేలఁ గపోలము లూఁది చూపులన్
విన్నదనంబు తోఁపఁగను ♦ వేఁడులునం బయిగాలి సోకినన్
వెన్న పలెం గలంగు నలి ♦ వేణులఁ గాఁగిటఁ జేర్చు భాగ్యముల్. 57

క. కుశలత యే వ్రతముల నగు, నశనాయాసమున నింద్రి ♦ య విరోధమునం
గృశుఁడవయి యాత్మ నలఁచుట, సశరీర స్వర్గసుఖము ♦ సమకొనియుండన్. 58

తే. అనినఁ బ్రియవరుండు నీవన్న ♦ యర్థమెల్ల, నిజము కాముకుఁడైన వా ♦ నికి నకాముఁ
డిది గణించునె జలజాక్షి ♦ యెఱిఁగితేని, నగరమార్గంబుఁ జూపి పు ♦ ణ్యమునఁ బొమ్ము.

క. బ్రాహ్మణుఁ డింద్రియవశగతిఁ, జిహ్మచరణైకనిపుణ ♦ చిత్తజనిశితా
జిహ్మగములపాలై చెడు, బ్రహ్మానందాదిరాజ్య ♦ పదవీచ్యుతుఁడై. 60

వ. అనిన నత్తెఱవ యక్కుఱకరిపలుకుల కులికి గతిగలిం గలవ గరకరిం జేటుకువిలుకాఁడు పరగించు విరిదమ్మి గొరకలు నాటులఁ జొటుకు చుఱుక్కునం గాఁడినఁ గడుం గెరలి పరిణత వివిధవిబుధతరుజనిత మధురమధురసంబాను మదంబునఁ జటునం జిదిమిన పెలుంగక మదనహరుఁడైనఁ జదురునం గదియ గమకించు తిమురునం గొమిరె ప్రాయంపు మదంబునను ననన్యకన్యా సామాన్య లావణ్య రేఖామదంబునను నొంటి పాటునం గంటికిం బ్రియుండై తంగేటి జుంటి చందంబునం గొంటుదనం బెలుంగక కులంగట నున్న యమ్మహీసురవరకుమారు తారుణ్యభాగ్యంబులం జేసి తన వైదగ్ధ్యంబు మెఱయఁ గలిగెనని పల్లవించు నుల్లంబు నుల్లాసంబునం గదురు మదంబున నోసరించుట చంచల దృగంచలప్రభ లతని ముఖాంబుజంబునం బొలయ వలయమణిగణచ్ఛాయాకలాపంబు లుప్పరంబెనరయఁ గొప్పు చక్కంజెక్కుచు జక్కవ గిబ్బలుంబోని గబ్బిగుబ్బలం జొబ్బిల్లు కుంకుమ రసంబునం బంకిలంబులగు హారముక్తాతారకంబుల నఖకోరకరంబులం గీఱి తీరుపడం జేయుచుఁ బతిత వనతరు కుసుమకేసరంబులు రాల్చు నెపంబునం బయ్యెద విదిల్చి చక్క సవరించుచు నంతంతం బొలయు చెలులం దల సూపక యుండేఁ దత్తఱంబునం జేసి బొమ మడిపాటుతో మగిడిమగిడి చూచుచుఁ జిఱుమడిపాటు చూపుల నంకురించు జంకెనల వారించుచుఁ జేరి యిట్లనియె. 61

ఎందే డెందము గందళించు రహిచే ◆ నేకాగ్రతన్ నిర్వృతిం
జెందుం గుంభగత ప్రదీపకళికా ◆ శ్రీదోఁప నెందెందుఁ బో
కెందే నింద్రియముల్ సుఖంబుగను నా◆యింపే పరబ్రహ్మ మా
నందో బ్రహ్మ యటన్న ప్రాఁజదువు నం◆తర్బుద్ధి నూహింపుమా 62

అనుచుఁ దన్నొడఁబఱుచు న◆య్యమరకాంత, తత్తఱముఁ జూచి యాత్మన◆తండు దనకు
సిగ్గు వెగటును బొడమ నిః◆స్పృహతఁ బలుకు, నొక్కచిఱునవ్వునవ్వి య◆య్యువిదకనియె.

ఈ పాండిత్యము నీకుఁ దక్క మఱి యెం◆దే గంటిమే కామశా
స్త్రోపాధ్యాయివి నా వచించెదవు మే◆లోహో! త్రయీ ధర్మము
ల్పాపంబుల్ రతి పుణ్యమంచు నిఁక నే◆లా తర్కముల్ మోక్షల
క్ష్మీ పధ్యాగమ సూత్రపంక్తి కివె పో ◆ మీ సాంప్రదాయార్థముల్. 64

తరుణీ! రేపును మాపు హవ్యములచే◆తం దృప్తుఁడౌ వహ్ని ప
త్కరుణా దృష్టి నొసంగు సౌఖ్యము లెఱుం◆గన్ శక్యమే నీకు నా
కరణుల్ దర్భలు నగ్నులుం బ్రియము లై◆నట్లన్యముల్ గా వొడల్
తిరమే చెప్పకు మిట్టి తుచ్ఛ సుఖముల్ ◆ మీసాలపైఁ దేనియల్. 65

అనుటయు మాటలేక హృద◆యాబ్జము జల్లన వోవ వెల్లనై
కనలుచు నీరు దేఱు తెలి◆గన్నుల నాతనిఁ బల్కుపల్కునం
గనుగొని మాటలం బొదువు ◆ గద్గదికం దల యూఁచి యక్కటా!
వనిత తనంతఁ దా వలచి ◆ వచ్చినఁ జుల్కనగాదె యేరికిన్. 66

వెతలం బెట్టకు మింక నన్ననుచు నీ◆వీ బంధ మూడన్ రయో
ద్ధతి నూర్పుల్ నిగుడన్ వడిన్ విరులు చిం◆దం గొప్పు వీడం దనూ
లత తోడ్తోఁ బులకింపగా నను నయా◆లాపాతి దీనాస్యయై
రతి సంరంభము మీఱ నిర్జర వధూ◆రత్నంబు పైపాటునన్. 67

ప్రాంచద్భూషణ బాహుమూల రుచితోఁ ◆ బాలిండ్లు పొంగారఁ బై
యంచుల్ మోవఁగఁ గౌగిలించి యధరం ◆ బానింప హా శ్రీహరీ
యంచున్ బ్రాహ్మణుఁ డోర మోమిడి తదీ◆యాంసద్వయం బంటి పొ
మ్మంచుం ద్రోచె కలంచునే పతుల మా◆యల్ ధీర చిత్తంబులన్. 68

త్రోపువడి నిలిచి ఘనలజ్జాపరవశయగుచుఁ గొప్పు ◆ సవరించి యొడల్
దీపింప నతనిఁ జుఱచుఱఁ గోపమునం జూచి క్రేఁటు◆కొనుచుం బలికెన్. 69

పాటున కింత యోర్తురె కృ◆పారహితాత్మక నీవు త్రోవ ని
ప్పాటల భవన్నఖాంకురము ◆ సోఁకెఁ గనుంగొనుమంచుఁ జూపి యా
పాటలగంధి వేదన నె◆పంబిడి యేడ్చెఁ గలస్వనంబుతో
మీటిన విచ్చుగుబ్బచను ◆ మిట్టల నశ్రులు చిందువందఁగన్. 70

క. ఈ విధమున నతికరుణామృ, గా వనరుహనేత్రి కన్నుఁగవ ధవళరుచుల్
గావిగొన నేడ్చి వెండియు, నా విప్రకుమారుఁ జూచి యలమటఁ బల్కెన్. 71

ఉ. చేసితి జన్నముల్ దపము చేసితి నంటి దయా విహీనతన్
చేసిన పుణ్యముల్ ఫలము సెందునె పుణ్యము లెన్నియేనియుం
జేసినవాని సద్గతియె చేయవు భూతదయార్ద్ర బుద్ధి నో
భూసురవర్య! యింత దలపోయవు నీ చదువేల చెప్పుమా? 72

సీ. వెలివెట్టిరే బాడబులు పరాశరుఁబట్టి, దాశకన్యాకేళి తప్పఁజేసి
కులములో వన్నె తక్కువ యయ్యెనే గాధి, పట్టికి మేనక చుట్టరికము
ననుపు కాఁడై వేల్పు నాగవాసముఁ గూడి, మహిమ గోల్పడియెనే మాండకర్ణి
స్వారాజ్య మేలంగ నీరైరె సుర లహల్యా జారుఁడైన జంభాసురారి

గీ. వారికంటెను నీ మహత్త్వంబు ఘనమె, పవనపర్ణాంబుభక్షులై యవని యిసుప
కచ్చడాల్ గట్టుకొను ముని ముఖ్యులెల్ల, తామరసనేత్రి లిండ్ల బందాలుగారె. 73

తే. అనిన నేమియు ననక యవ్వనజగంధి, మేని జవ్వాదివాసన కదంబించు నొడలు
గడిగికొని వార్చి ప్రిపరయండు గార్హపత్యవహ్ని నిట్లని పొగడె భావమునఁ దలచి

మ. దివిషద్వర్గము నీ ముఖంబునన తృప్తిం గాంచు నిన్నీశుఁగా
స్తవముల్ సేయు శ్రుతుల్ సమస్త జగదంతర్యామివి నీవ యా
హవనీయంబును దక్షిణాగ్ని యును నీయం దుద్భవించుం గ్రతూ
త్సవసంధాయక నన్నుఁ గావఁగదవే స్వాహావధూవల్లభా. 75

ఉ. దాన జపాగ్నిహోత్ర పరతంత్రుఁడ నేని భవత్పదాంబుజ
ధ్యానరతుండ నేనిఁ బరదార ధనాదులఁ గోర నేని స
న్మానముతోడ నన్ను సదనంబున నిల్పు మినుండు పశ్చిమాం
భోనిధిలోనఁ గ్రుంకకయ మున్న రయంబున హవ్యవాహనా. 76

వ. అని సంస్తుతించిన నగ్నిదేవుం డమ్మహీదేవు దేహంబున సన్నిహితుండగుటయు నమ్మహాభాగుండు గండుమీఱి పొడుపుఁగొండ నఖండ సంధ్యారాగ ప్రభామండలాంతర్గతుండగు పుండరీక వనబంధుండునుం బోలె నుత్తప్త కనకద్రవ ధారాగౌరంబగు తనుచ్ఛాయాపూరంబున నక్కానన వెలింగించుచు నిజగమన విరోధిని యగు నవ్వరూథిని హృదయకంజంబున రంజిల్లు నమందానురాగరస మకరందంబు నందంద పొంగం జేయుచుఁ బావక ప్రసాదలబ్ధంబగు పవన జవనంబున నిజ మందిరంబున కరిగి నిత్యకృత్య సత్కర్మ కలాపంబులు నిర్వర్తించెనని మార్కండేయుండు క్రోష్టికిం జెప్పెనని చెప్పిన. 77

క. జైమిని యా దివ్యఖగ, గ్రామణులం జూచి వేడ్క ♦ గదలుకొనంగా
నామీఁద వరూథిని విధ, మేమయ్యెఁ దెలుంగఁ జెప్పరే నా కనుడున్. 78

శా. నిస్తంద్ర ప్రతిభాసుధీనుత దిశో ♦ న్మీలద్యశశ్శ్రీవధూ
హస్తాగ్రామలకాయమాన మహనీ♦యాంభోజ గర్భాండ సై
న్యస్తోమోత్థ రజోవ్రజ స్థగిత కృ♦ష్ణా గౌతమీ మధ్య భూ
మ్యస్తోకోత్కల రాట్పరీవారణ లీ♦లావార్య శౌర్యోదయా. 79

క. బిసరుహనయనా నవవిధ, కుసుమాయుధ యవధిగుధర ♦ కూటాంచల భూ
విసృమరతేజ శ్చంపక, భసలదస తీక్ష్ణార్త్తి మలిన ♦ పరిపంథిన్నృపా. 80

కవిరాజవిరాజితము.

నల నృగు రంతి భగీరథ భారత ♦ నందన కల్ప యనల్పయశో
జ్జ్వలుకితలోక విలోకి వధూజన ♦ సూనశరాసన మానఖనీ
ప్రళయ ఘనాఘనఘోషజయానక ♦ భాంకృతి భీమచపేటులుర
త్కలబరిగీకటక క్షితిరక్షక ♦ కన్నడరాజ్య రమారమణా. 81

ఇది శ్రీమదాంధ్రకవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్ష
పాదాంబుజాధీన మానసేందిందిర నందవరపుర వంశోత్తంస
శఠకోపతాపస ప్రసాదాసాదిత చతుర్విధకవితామతల్లి
కాల్లసాని చొక్కయామాత్యపుత్ర పెద్దనార్య
ప్రణీతంబయిన స్వారోచిషమనుసంభవం
బను మహాప్రబంధమునందుఁ
ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ

# స్వారోచిష

# మనుచరిత్రము

## తృతీయాశ్వాసము

శ్రీ వేంకటేశ పదప,
ద్మావేశిత సదయహృదయ ◆ హర నిటలనట
త్పావక పరిభావిమహః
ప్రావృత నిఖిలాశ కృష్ణ◆రాయ మహీశా. 1

వ. అవధరింపు మమ్మహాత్మునకుఁ బత్ను లిట్లనియె. 2

శా. ఆ భూదేవకుమారుఁ డేఁగినఁ దదీ◆యాసూనరమ్యాకృతిం
దా భావంబున నిల్పి యంగభవ కో◆దండోగ్ర మౌర్వీరవ
క్షోభా కంపిత ధైర్యయై యలతస◆చ్చో నిల్వక చ్చెల్వ త
ద్భూభృత్సీమలవెంటఁ గానలఁ బడెన్ ◆ దుఃఖాబ్ధి నిర్మగ్నయై. 3

క. తిరుగుచు ధరణీసురవరుఁ, దరగిన చొప్పరసి యరసి ◆ యటఁ గానక యా
హరిణాంకముఖి సఖీజన, పరివృతయై మగుడి వచ్చి భావములోనన్. 4

ఉ. అక్కట వాఁడు నా తగుల ◆ మాఱడిసేసి దయా విహీనుఁడై
చిక్కక త్రోచిపోయె దరి ◆ జేరఁగరాని వియోగసాగరం
బెక్కడ నీఁదుదాన నిఁక ◆ నీ కొఱనోములు నోఁచినట్టి నే
నెక్కడ వానికౌఁగి లది ◆ యెక్కడ హా విధి యేమిసేయుదున్. 5

ఉ. కమ్మని కుందనంబు కసు◆గందని మేనెల దేఁటి దాటులన్
బమ్మెరవోవఁ దోలు చెగ◆బారెడు వెండ్రుక లిందుబింబముం
గిమ్మననీదు మోము గిరి ◆ క్రేపులు మూఁపులు కాను గాన రా
దమ్మకచెల్ల వాని విక◆చాంబకముల్ శతపత్ర జైత్రముల్. 6

ఉ. చొక్కపుఁ బ్రాయమున్ మిగుల ◆ సోయగమున్ గల ప్రాణనాయకుం
డక్కుడు వశ్యతన్ రతుల ◆ నేఁకట దీర్చి సమేళ మొప్పఁగా
నక్కున గారవించి ప్రియ◆మందఁగ నోచని యింతి దైన యా
చక్కదనం బదేమిటికి ◆ జవ్వనమేటికిఁ బ్రాణమేటికిన్. 7

చ. మరున కొసంగఁ గాలము త♦మశ్చట గాటుకగా నవోదయ
స్ఫురదరుణ ప్రభాపటిక ♦ శోణిత సిక్తసితోడు భక్తముల్
హరిహయ దిఙ్నభస్స్థలమ♦నన్ బలి చల్లి వటాంశముల్ వరూ
త్కర భరితంబులై వెలుఁగఁ ♦ గాంచి సుధానిధి నెత్తె నత్తఱిన్. 21

మ. జలజాగార పరంపరల్ మధువదా♦శా భిత్తిఁ దిండ్రించుచున్
దళమై వెన్నెలచిచ్చు లంటిన మిళ♦ద్భ్రామ్యచ్ఛద శ్యామికా
చ్ఛలనం గంది ముడుంగుచో నిమనిమ ♦ చ్ఛబ్దంబుతోఁ బుట్టు న
గ్గలపుం గ్రొంబొగలో యనంగ వెడలెన్ ♦ గర్భస్వనద్భృంగముల్. 22

సీ. శిథిల కైరవదళ♦శ్రేణి నొత్తులు దీఱె, శశికాంత పంక్తుల ♦ జలము లూఱె
గోరి కాంతులతోఁ జ♦కోరికల్ రతిఁ గేరె, వారాశి గర్వంబు ♦ మేరమీఱెఁ
ద్రోపది యిరులు ప♦టాపంచలై పాఱె, దిఙ్ముఖంబుల వింత ♦ తెలివి సేరెఁ
జక్రవాకంబు ల♦బ్జకుడుంగములఁ దూఱెఁ, గామినీకాంతుల ♦ కలకఁ దేఱె

గీ. మదనుఁ డమ్ముల నూఱె హి♦మంబు మీఱె, జడిసి విరహిణి వగఁ గూఱె ♦ జారచోర
దర్పములు జాఱె రవికర ♦ తాపమాఱెఁ, జూడఁ జూడంగ దారక♦స్ఫురణ దాఱె.

మ. స్ఫుటసౌగంధిక రాగరక్తరుచిమైఁ ♦ బూనెం జపాసన్నిధి
స్ఫటికం బట్టులదయాద్రిగైరిక శిర♦స్స్థానస్థితిం జంద్రుఁ డ
చ్చొటు వాయన్ శుచియయ్యె నాఁ బ్రకృతి న♦చ్ఛుండైన సన్మార్గియు
న్నటికిం గూటమి వంక వచ్చు వికృతి ♦ న్మగ్నుండు గా నేర్చునే. 24

శా. ఆ రూఢస్థితి జంద్రికాధవళితా ♦ జాండంబులోఁ జంద్రుఁ డొ
ప్పారెం గాలభిషగ్వరుం డవిరతం♦బై కాముకశ్రేణికిన్
మారోత్సాహము నిల్పఁ బాదరసమున్ ♦ బంధించి గ్రాసార్థమై
క్షీరస్థాలికఁ బెట్టినట్టి గుటికా ♦ సిద్ధౌషధంబో యనన్. 25

తే. రాజు తేజస్వియై గ్రహ♦రాజుమీఁద, నలిగి దాడిగ వెంటాడ ♦ నిలువ కతఁడు
బెగడుపడి పాఱుచోఁ జెలి ♦ దగిలినట్టి, ఛాయ యిది యన నీలలాం♦ఛనము మెఱసె.

గీ. కలయ జగమున గలయట్టి ♦ వలపు లెల్ల,
తెలుపులుగఁ జేసి నీడలం ♦ దెలుపు సేయఁ
గా వశముగామిఁ బొదమ దుః♦ఖమునఁ బోలె,
సాంద్రచంద్రిక తుహినబా♦ష్పములు గురిసె. 27

వ. మఱియు వికసిత కైరవంబులగు సరోవరంబుల నిజధవళ ధాళధళ్యంబున నాక్రమించి యందు నానందించు నరవిందమందిరకుం బుట్టినింటి సొబగు చూపి చూపఱకు నిండు బింబం బిది గ్రహాంబు లివియను నంతరంబు తెలియకుండ నేకవర్ణంబు గావించి సేవించు చకోరకదంబంబుల పుక్కిళ్లకు వెక్కసంబై ముక్కులకు నెక్కి చిక్కం

బడి యొండొండ బొండు మల్లియల దండడిం దొలఁగు పుప్పొళ్ల నుప్పతిల్లు నెత్తావులకు వెకలులై యాడు మొకరి తుమ్మెదలు రొదలుగల మెఱుఁగుడు బురువులట్లు మిసమిసని మెఱవ నసి మెఱుంగు మొత్తమ్ముల నుమినీ యామినీ యందంద ప్రవహించు నిందూపలస్యందంబులకు బిందులగు నిందీవర మరందంబుల బెందడింబడి బందనగొను వలిమించు క్రొమ్మంచుటొదు లీఁదియీఁది వడి నడలి సుడివడుచు నొదలో మసోమరి గాలి యెలవోక నోఁకులం గదలెం గదల వనం గదలు నుకవనకదళీ కేతకీ తాల హింతాల నారికేళ పూగావళి కోమల పలాశద్రోణికల నునుపుగల పారల యోరల శరధి తరగల మీదనుంబోలె గిఱికొని, యొల్లవల్లికలుఁ బూవక పూచిన ట్లుల్లసిల్ల నుల్లంలసిల్లిన చందంబునం దెల్ల తెల్లనై, మొల్లమిగ నంతకంతకు దిగంతంబుల దంతంబులు దీరిచిన యిడుపులుంబోలెఁ దీండ్రింప కేయొండఁదానగుటం జేసి యెండమావులం బుట్టించె నసం బట్టుగల పటికంపురాచట్టు నేలల నెట్టుకొని వెండియుం జిట్టకంబులకుం బెడమొగంబు వెట్టుకొని పట్టఁబట్టం బోవు ప్రాణ భర్తలవెంట బడి నూపురంబులు మొరయ వేనలులు విరియఁ గ్రమంబునం బుట్టు నిట్టూర్పుపవనంబు జవంబునం బైకొనం గౌఁగిలింప నందని కాఁగిటం బొదవి ప్రియుంబు చిలుకం బలికి ముద్దాడు జవరాండ్ర దంతచంద్రికల సాంద్రతఁ బంతంబు మెఱసి మంతనంపు వేళల మాటతెబ్బిబ్బునం బుట్టు పాలయలుకలం దవిలి వంచి రొదలేని నాలియేడ్పులేడ్పు ప్రియల ననునయింప నింపునం జనవు మెఱసి చెక్కుటద్దంబులు నొక్కి మొగంబెగయనెత్తి మొత్తియంపు ముంగఱరంగునఁ గడలుకొను బుడిబుడి కన్నీటం బ్రతిఫలించి తుఱంగలించు తవదు నిగనిగలు కనుంగొని నగనగ ననుచుం జుంబనం బిడం బోయి కెంగేల నదరంట వాడువడు కాముకుల వెలవెలపాటుకూటునం గోటికిఁ బడగలెత్తి పిండిచల్లిన గతిం గాయ డాయ లజ్జించి లజ్జవంబునం బొదరిండ్లకుం డార్చి కాంతులం గవయు నంగనాచులగు నంగనల యంగంబుల పస ముంగిటం బడఁ జలితకిసలయాంతరాళంబులం దూటితూటి యిరులు విరియించి పతుల ప్రార్థనంబులం బుంభావసుర తాడంబరంబునకుఁ దొడుసూపి దూపటిలి యంగరాగంబులు గరగం జెమర్చిన చంచలాక్షుల నిద్దంపు తనూలతలం బుట్టి దట్టంబులగు చిఱుచెమట బొట్టులం బొడకట్టి తెలుపారు మలయజంపుఁజిటులు గందంబుల యందంబులొసంగి స్తంభకడం దారు నొడివిన సంకేతంబుల నుండక తెరువు గట్టి పొదువుఁ దరువుల నీడల నడంగి నవ్వుటాలకు వెనుకపాటునఁ గదిసి ముసుంగు లెడలింప బెగడి కళవళంపు జూపుల వల్లభులం జూచి యల్లననగు నభిసారికల వెడందకన్నుల చెన్నున నన్నుకొని పొదలు మదనోన్మాదంబునకుం బ్రోదిగా మోదంబునం గాదంబుకి గండూషించి విటకదంబంబునకు నొసంగు నంబురుహముఖుల యొప్పులకుప్పలగు నిప్పపూమొగ్గలంబోని బుగ్గలం దగ్గలిక నూరుకమ్మ పంజుల పత్రిపుంజక చకల నకనకలం వీడుకొని కలికితనంబునం గలసి మెలసి రతాంతంబున బరిశ్రాంతి యడంగ నంగణంబుల నిలిచి యొండొరుల కురులం దువ్వుచు విహరించు సమయంబునం బల్లవులం కేళి కల్లప్పుడన్న తమ మాటలు దలపించిన నదరిపడి మందస్మితంబులంకురించు హుంకృతుల జంకించి కంకణంబు రత్నపుఁ ధళుకులు నెదర నుంకించి

వైచు చేమంతి బూబంతులం బుటంపుటనై మిటమిటం గాయు దట్టంపు పండు వెన్నెల యెండున బెండువడి డెందంబు గంది తాలిమి చిందువందై కెందలిరుపాన్పునం దను వొందక లేచి కూర్చుండి కన్నీరు గోటమీటుచు బోటితో వరూధిని యిట్లనియె. 28

ఉ. నోములు నోచినమ్మలు మ◆నోరథముల్ దయివాఱ నిత్తఱిం
దామరతంపరై ప్రియులఁ ◆ దారు విహారము సల్ప వీరిలో
నీ మెయి దుఃఖశీలనగు ◆ నే వసియింపఁ దరంబె? పోద మా
రామము జూడ నందు సుక◆రంబగు సర్వము నంబుజాననా. 29

క. అని పలికి పాన్పు డిగి కామిని చంద్రాతపము వేడి◆మికిఁ బైఁట చెఱం
గున ముసుగిడి నిజకేళీవనిఁ జొచ్చి వియోగవహ్ని ◆ వడఁబడి తెగువన్ 30

సీ. చనుఁగప్పు దొలఁగ వా◆సనగాలి కెదురేఁగుఁ, బరువొప్పు నలుఁగులఁ ◆ బాఱుకరణి
నిడుదవేనలిసూసె ◆ మఁడివీడఁ జిగురాకుఁ, బొదఁదూఱుఁ గార్చిచ్చుఁ ◆ గదియుకరణిఁ
బసిడిగాజులు పైకి ◆ వెసఁ ద్రోచి సుమదీఁగ, దెమలించు సురిత్రాడు ◆ నెమకు కరణి
మొలనూలు బిగియించి ◆ వెలఁది వెన్నెలఁ జొచ్చుఁ, బిఱుదీయ కేటిలో ◆ నఱుకుకరణి

గీ. జడియక దళులకుఁ గురియు ◆ పుష్పాదుల మునుఁగు, మాఱికడ నిల్చు విరుల సె◆త్తావిఁ గ్రోలు
విషమసాయకు పేఁపుల ◆ నిసివి విసివి, తనువుఁ దొఱఁగంగఁ దలఁచి య◆వ్వనరుహాక్షి.

క. అట్టియెడ నమ్మృగేక్షణఁ, బట్టి సఖీజనము వెడఁగుఁ ◆ బట్టీ తగవే?
యిట్టి తెగువనుచుఁ జెక్కులఁ, దొట్టిన కన్నీరు వోవఁ ◆ దుడుచుచుఁ బలికెన్. 32

ఉ. పూతపసిండివంటి వల◆పుం బచరించు కులంబు నీతికిన్
లేఁత గదమ్మ యిత్తెఱఁగు ◆ లేమ సురాంగనలెల్ల నిట్టి నీ
చేఁతకు మెత్తురమ్మ దయ ◆ సేయక తిన్నని మేను వెన్నెలన్
వేఁచు రఁటమ్మ యింత కను ◆ వేఁదుఱు పెల్లునఁటమ్మ యింతికిన్. 33

చ. ఉడుపతి బారికిన్ వెఱచి ◆ యయారతు మహాసని పేరుటామనిన్
మడిపడు కంతుసేనలకు ◆ మాయ్యల గుట్టయినట్టి యిందు రా
నడుగునె తాపవహ్ని మన ◆ సైపె హరిణేక్షణ మల్లి పుచ్చి కా
ఱ్ఱడచిన చందమయ్యెఁ బన ◆ మా యెలదోఁటఁ జరింప కింటికిన్. 34

క. అని యొడఁబడఁ బల్కుచుఁ దోడ్కొని వచ్చినఁ బాన్పుఁ జేరి ◆ గురుకుచ దనపైఁ
గనకనఁ గనలెడు వెఱఁగులఁ, గనికర మఱి మందుచంద్రుఁ◆గని కరములకన్. 35

క. ఓ చెల్ల విరహిణీవధ, మే చతురత నీకు దురిత◆మే చేయుపనుల్
ప్రాచీనకపు ఫలమో యీయొప్పా చంద్ర వివేక మెఱుఁగ ◆ వోకా గురుసేవన్. 36

సీ. తొలుదొల్తఁ గమలమి♦త్రుని వంక యాపోటు, దక్షాధ్వరధ్వంసి ♦ తన్ను గనుటఁ
బరివేషమిషమున ♦ బాశంబుఁ దాల్చుటఁ, గప్పు దేహమునందుఁ ♦ గానఁబడుటఁ
గాలవశంబునఁ ♦ గాని తోఁపకయుంట, సతతనిష్ఠురగదా♦స్వీతతఁ గనుటఁ
బూని పాండుక్షేత్ర♦మునఁ బరివర్తించుట, బరికటానురాగ తా♦రకుఁడగుటను

గీ. నంతరంబెద్ది యాత్మలో ♦ నరసిచూడ, రాజ నీకును నల ధర్మ♦రాజునకును
బ్రాణిశోకంబు బాధలఁ ♦ బఱచునపుడు. ధర్మపద మొక్కఁడెక్కుడా ♦ ధన్యనందు

చ. ఒక పెనుఁబాఁప శేఁడు చల♦మొప్ప రసాతల సీమకుం జకో
రకములు భూతధాత్రికి సు♦రల్ దివికిం బఱ దీఱునట్లుగా
మెకమెక పాటుతోడ నిను ♦ బ్రింగక పోరపుడుం ద్రిలోక కం
టకుఁడవు గాన నీ యెడలఁ ♦ నజ్జగఁజేసె కురంగలాంఛనా!

క. వాతాపి వలన నెఱిగితొ, శీతకిరణ కడుపుఁ జొచ్చి ♦ జీర్ణింపని యీ
రీతి నినుఁ దివియు నాయువు, చేత సురల్ చెడరుగాక ♦ చెఱుపవె వారిన్ 39

తే. త్రిపుర సంహార మొనరించు ♦ నపుడు హరుఁడు, బండికల్లుగ నీ మేను ♦ గండిచేసె
నదియు నెలవాఁతి తెగటాఱ♦వైతి చంద్ర, యకట రోహిణియొద్ద నప♦థ్యమునఁ జేసి.

తే. పాలఁ బుట్టిన మాతోన ♦ మేలిగుణము, నేఁడు నీకేలఁ గల్గుసూ ♦ నీరజారి
నీటఁ బుట్టినవాడు గాఁ ♦ డోటు వహ్ని, గాల్చుచున్నాఁడు జగమెల్లఁ ♦ గరుణలేక.

క. గోవధము సేయు తుఱకల, దైవంబవు నీవు మొదలఁ ♦ దక్కుక పాంథ
స్త్రీవధము సేయ రోయుదె, నీవర్తన మేమి చెప్ప ♦ నీరజవైరీ. 42

క. విడువక తలపయిఁ గొన్నాళ్ళిడి చూచి కళంకి వగుట ♦ రోజెఁగి మహేశుం
డుడుకుచు దక్షాధ్వరమున, నడుగునఁ బడవైచె దాన ♦ నడఁగవు చంద్రా. 44

క. గాండీవము నీచేతిది, పాండవునిం జేరఁబట్టి ♦ బ్రతికితి మా వి
ల్లుండిన నేఁడు నిశాచర, చెండవె యల్లునికి దోడు ♦ శితభల్లములన్. 44

వ. అని పలికి యక్కలికి తేనియ లొలుకు పూములుకుల జలుకుఁ బుట్టించు నించు విలుతు
నుద్దేశించి. 45

చ. తొడిఁబడఁ బాఱవై కుటిల ♦ ధూర్జటి కంటికడింది మంటలో
నడపొడ గానరాక తెగ♦టారియుఁ గాలినయట్టి మ్రోడు కై
వడి రతిలోచనాంబువుల♦వాన నిగిర్చితె పాంథ బాధకై
మడియ కనంగ యవ్వెలఁది ♦ మంగళసూత్ర మహత్త్వమెట్టిదో. 46

శా. సాహంకారత శంకరుం డలిగి నే♦త్రాగ్నిం బయిం బంపినన్
స్వాహా కాముకుఁ డొట నిస్సత్తుఁడు గా♦వం బోలు మోమోడి సం
దేహం బేని రతీశ నీవు మగుడన్ ♦ దేహంబుతో నుండు టె
ట్లాహా దైవము దోసకారులకె తో♦డై వచ్చు నెప్పట్టునన్. 47

చ. జడ నొక యింతలేని నెఱ ♦ చక్కదనంబుల నెల్లఁ గూర్పఁగాఁ
బొడవయినట్టి ధన్యుఁడవు ♦ భోగివి పూవిలుకాఁడ విట్టి నీ
వెడపక నిష్ఠురత్వమున ♦ కట్లలవాటుగఁ జేసి తక్కటా
పడఁతులమీఁద నేయు రతి ♦ పయ్యెదకున్ నవ్వైన చేతులన్. 48

తే. అనుచు నిందించి వలవంత ♦ యినుమడింప, నవ్వరారోహ విదళిత ♦ హల్లకముల
కమ్మ పుప్పొడిపై దుమారమ్ము రేఁచు, మలయమంథర పవనుపై ♦ నలుక నొదవి.

ఉ. అక్కట గంధవాహ తగవా హరిణాంకునిఁ గూడి పాంథులం
బొక్కఁగఁ జేయఁ బావకుని ♦ పొందొనరించి జగమ్ము లేర్చు నీ
యక్కఱగామి మానవది ♦ యట్టిద చుక్కనివృత్తి దుర్జనుం
డొక్కనిఁ జొచ్చి క్రిందుపడు ♦ నొండ్లకుఁ గీడొనరింపఁ గల్గినన్. 50

క. నాలుకలు రెండు నిన్నుం, గ్రోలను కల్పించె నలువ ♦ ఘోరాహికి న
న్నాలిగ్రహ మిపుడుఁ దెగఁ దిన, జాలద మృదుపవన విరహిజన దురితమునన్. 51

వ. అని పలికి యక్కలకంఠకంఠి దీపించు తాపంబున పెల్లున మూర్ఛిల్లినం దోడిపల్లవోష్ఠు లల్లనల్లన హల్లకంబుల హిమాంబుపూరంబులం గర్పూరపటీర కర్దమాసారంబులం జెంగావుల మృణాళభంగంబుల నంగంబులకుం జలువ పుట్టింప నెట్టకేలకుం దెలిసె నంత ప్రభాతసమయం బగుటయు నొక్క పువ్వుఁబోడి వరూథినితో నిట్లనియె. 52

ఉ. పాటన సేయమిం గురులు ♦ పైఁబడి శీర్ణపటీర పంకలా
లాటికపై దరస్మిత విలాసపు జంద్రిక డొంకి వాడుటం
జేటుఁ దొలంగి విన్ననగు ♦ నీ మొగమో యన మాళి చంద్రుఁడో
పాటలగంధి వ్రాలె నదె ♦ భానురుచిం దనకందు మీఱఁగన్. 53

సీ. సకుటుంబముగఁ బీఁగి ♦ చరమశైలముఁ జేరు, తుహినాంశు దుముదారు ♦ దొరయనంగ
నాసీరమై వచ్చు ♦ నలినబాంధవు టెక్కె,యంబుపై దీపించు నడ్డ మనఁగ
నరుణాగ్రి నిబిడ వాద్యములలోఁ గనుపట్టు, సమయశాంఖికు చేతి ♦ శంఖమనఁగ
నినుఁ దప్పడఁ జాఁడాట ♦ మునుమున్న పడివాగె, గొనివచ్చు రాయంచ ♦ కొదమయనఁగ

గీ. నుదయగిరి మీఁదఁ గోపురం♦బుండి నిగుడు, నహిత రవి రశ్మిచే బద్ధుఁ♦డగుచుఁ దోడి
బలగమైనట్టి చుక్కల ♦ వలప త్రోవఁ, జూప శైతెంచె నన వేగుఁ ♦ జుక్క వొడిచె.

మ. సకలాశాగతి వర్మలోపవిరతీ ♦ శ్రౌతక్రియారంభణా
త్మక వర్గత్రయికిన్ మదుచ్చరిత శబ్దజ్ఞానమే మూల మిం
తకుఁ బోలన్ వినుఁడంచుఁ దెల్పెగతిఁ ♦ జెంతం గొండపై పల్లెలం
గృకవాకు ల్స్వరసిద్ధి గృహోపరిఁ ద్రిభంగిన్ భుగ్న కంఠధ్వనిన్. 55

మ. ఇనుఁ డస్తాద్రికిఁ బోవఁ గొల్లగొని ♦ నేఁ జేతేరఁ దద్దీప్తి సం
జనసంబంధజ బాంధవంబున రతి ♦ క్రాంతాంగనా నేత్రకో
ణని కాయంబుల దాఁచి తద్ధవళిమం ♦ దాఁ బూనెనో చొప్ప మా
ర్పనసన్ వెల్వెలఁ బాఱె దీపకళికా ♦ వ్రాతంబు కృశోదరీ. 56

శా. వాలారుం గొనగోళ్ల నీ వల్లసతన్ ♦ వాయించుచో నాటకున్
మేళం బైనవిపంచి నిన్న మొదలున్ ♦ నీ వంటమిం జేసి యా
యాలాపంబె యవేళఁ బల్కెడుఁ బ్రభాతాయాత వాతాహతా
లోలత్తంత్రుల మేళవింపఁ గదవే ♦ లోలాక్షి దేశాక్షికిన్. 57

చ. పలుకులు నేర్పువేళ గలభాషిణి నీవిటు లుంచఁ బంజరం
బుల నరగన్ను వెట్టి ముఖముల్ చరణాగ్ర నఖాళిఁ గ్రోఁకుచున్
నిలుగుచు నావులించుచు వనీవిహగోత్కర మెట్లు వల్కె న
ప్పలుకులె యట్టు లెత్తి విని ♦ పల్కెడు వింటివె కీరశారికల్ 58

మ. ఉరుసంధ్యాగ్నిపశోణ మృత్కలితమై ♦ యొప్పారు బ్రహ్మాండ మ
న్దరిడిం గాలప్రహరాంతకాఁడు చరమాగస్కంధమం జేర్చు ని
బ్బరపున్ సంగడమో యనన్ శశి డిగం ♦ బ్రాగ్భూమిభృత్త్రైత చే
తరబాహాగ్రపు సంగడంబనఁగ మార్తాండుండు దోచెన్ దివిన్. 59

చ. కరకరి, గూటఁ గట్టి యిడఁగా మొఱ వెట్టెడు లీల శాలభా
స్కరకర కాండకందళవిఘట్టన నించుక వాయివడ్డ తా
మర మొయి వెట్టి వెట్టి పలు ♦ మాఱును వాకిలి దాఁటి యాఁగుచున్
మొరయు విపంచి మీటుగతి ♦ మ్రోసి యళుల్ వెడలెం గొలంకులన్. 60

చ. అదరున పీనభాను కిరణావల మంటినఁ గూడుకొన్న పు
ప్పొడి కొలు చెల్ల మోచికొని ♦ పోరొడి సంభ్రమ మొప్పఁ గంటివే
పడఁతి భవద్విహారవన ♦ పద్మసరః కుముదాలయంబులన్
వెడలు మిళిందబృందములు ♦ పెఁపుపికొంగిమ కైతవంబునన్. 61

చ. కాలకాలఁ గూయఁ బై నొలగఁ ♦ గుత్తుకఁ గుత్తుకఁ జొట్టు పొలు చి
ల్వలక్రియఁ గానరాని గతులన్ మయిమైఁ బెరుచుం జనించు న
తి లలిత నొత్తు సోలు నిలుచున్ విధిచాతురిఁ గూడియున్ రతిం
దలపవుకం బెపాసినవేతల్ దలఁపించుచుఁ గోకదంపతుల్. 62

ఉ. ఇందుని భాస్య వాఁడనఁగ ♦ నిందుఁడొ చందుఁడొ యాయ యేందుఁడో
యిందునకై వగం బొగుల ♦ నేటికి నేఁటికి నందుఁబోద మా
నందనభూమి భూమిసుర ♦ నందనుఁ డుండకపోఁడు రమ్ము నీ
చందము నందమం గనిన ♦ జవ్వని యవ్వని వెట్టిఁ జేయదే. 63

ఉ. ఏల దురంతవేదన మెయిం బొరలాడెదు తాల్మి దక్కి పేఁ
లే లలితాంగి యెంతపని ♦ లెమ్మిది విప్రవరుండు గోలయున్
జాలఁడు గాన నప్పటికిఁ ♦ జైపడఁ గొంకెను గాని వానికిన్
గాలొకచోట నిల్చునె వశంగతుఁడౌ నినుఁ జూచు నంతకున్. 64

క. రా రమ్మనుటయు దివిష, న్నారీరత్నంబు నిట ♦ నాళధునీక
ల్హారాంభోరుహ మధురస, ధారాచంద్రికితసలిల ♦ ధౌతాననయై. 65

సీ. ఘనసారపంక మింపెక్క లతాంగి దెచ్చిన, మట్టి వ్రేలనె చుక్క ♦ బొట్టు వెట్టి
యింతి యొక్కతె పూవు ♦ టెత్తులెత్తినఁ జూచి, విసువుతో నొకకొన్ని ♦ విరులు దురిమి
పడఁతి యొక్కతె రత్న ♦ పాదుక లిడ నిల్చి, తొడుగ కవ్వలికిఁ బో ♦ నడుగు వెట్టి
బాగాలు వెస నొక ♦ పద్మాక్షి యొసఁగిన, వెగ్గలంబని కొన్ని ♦ వెడల నుమిసి

గీ. సగము గొఱికిన యాకులు ♦ సఖులు పిలువ,
సగ మొసఁగు నుత్తరమ్ముఁ దెల్పి ♦ సగము మఱపు
సగము నయి చింత చే సగ ♦ మగుచు జరిగె,
న వ్వరూథిని యంతి కో ♦ ద్యాన మునకు. 66

వ. ఆ సమయంబున దేవజాతిత్వజనిత విమలజ్ఞాన పాటవంబునం దద్వృత్తాంతంబు సమస్తంబు నెఱుంగుటం జేసి.

శా. ఏ గంధర్వుఁడు తద్విలాసములు మూ ♦ న్వీక్షించి తా నెంతయున్
రాగాంధుండయి కోరి పొత్తుక గడున్ ♦ రారాపులం గంతుఁడు
ద్వేగం బందఁగఁ జేయ నెవ్వగల నువ్విళ్ళూరుచున్ వేఁగువాఁ
డా గంధర్వకుమారుఁ డంగభవ వి ♦ ద్యాపారగుం డాత్మలోన్. 68

ఉ. ఒక్కొకవేళ పద్మముఖు ♦ లొల్లమి సేయుదు రొక్కవేళఁ బ
న్నక్కువ నాదరింతురు క్ష ♦ ణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్
పక్కున వేసటం జన దు ♦ పాయములం దగు నిచ్చకంబులన్
జిక్కఁగ జేసి డాసి సతి ♦ చిత్తముఁ బట్టి సుఖింపఁ గాఁ దగున్. 69

క. అని తలఁచి యవ్విలాసిని, యనిశము గ్రీడించు పుష్పి ♦ తారామంబున్
మును కలుగఁ జొచ్చి యొక చంద్రన భూజము నీడ నిల్చి ♦ దంభం బమరన్ 70

సీ. అర్ధచంద్రుని తేట ♦ నవఘళించు లలాట, పట్టిఁ దీర్చిన గంగ ♦ మట్టితోడఁ
జెక్కుటద్దములందు ♦ జిగి వెల్లువలు చిందు, రమణీయ మణికుండ ♦ లముల తోడ
పసిఁడి వ్రాతచెఱుంగు ♦ మిసిమి దొప్పఁ జెలంగు, నరుణాంశుకోత్తరీ ♦ యంబు తోడ
సరిలేని రాకట్టు ♦ జాలువా మొలకట్టు, బెడఁగారు వీర్కావి పింజెతోడ

గీ. ధవళ ధవళములగు జన్ని ♦ దములతోడ, నాశికాముద్ర యిడిన యం ♦ గరముతోడ
శాంతరస మొలుకు బ్రహ్మ తేజంబుతోడఁ, బ్రవరుఁ డయ్యె వియచ్చర ♦ ప్రవరుఁ డపుడు

క. ఇటు యువ్వరూథినియు నొక్కొకటఁ గతిపయ సఖులుఁ దన్నుఁ ♦ గొలచి నడువఁగాఁ
జటుల ఝుళంఝుళరవపద, కటకసమాకృష్ణ కేళి ♦ కలహంసికయై. 72

సీ. ఉరగపూత్కార ధూ♦మోగ్ర గంధముఁ బాసి, పొలయుఁ బో యీ తావి ♦ మలయపవనుఁ
డనలాత్ము పెడబొబ్బ ♦ వలమిన తలదిమ్మ, పాయుఁ బో యీ తేంట్ల♦పాట మరుఁడు
ఘర్మ సామీప్య సం♦కలిత దాహస్ఫూర్తి, నాగుఁ బో యీ నీడ ♦ నల్ల మధుఁడు
గరళసోదర్యాత్త♦కరసుధా కటుకత్వ, మూడుపుఁ బో యీ తేనె ♦ నోషధీశుఁ
గీ. డనఁగఁ జంపక కురవక ♦ పనస తినిశ, నిచుల వంజుల దాడిమీ ♦ విచికి లావ్రి
పాటలీ పూగ కేసర ♦ ప్రముఖతరుల, సొబగు మీఱు నుద్యానంబు ♦ జొచ్చి యచట.

మ. పవమాన ప్లవమాన పంకజ రజః♦పాళీ పిశంగచ్ఛవీ
భవదభ్యర్ణ వికీర్ణ కృత్రిమ సరి♦త్పాథస్తరంగాహతైం
దవపాషాణ వితర్దికాతలమునన్ ♦ నాళీకపత్రాత్ము లిం
తవుఁ బెంపొప్పఁగ విహరించుచున్ సరసవా♦చా ప్రౌఢిమ ల్మీరఁగన్.

చ. బటువయి విఱ్ఱవీఁగి పరి♦పాటిగఁ జూచి పరాగపుంజ మొ
క్కొకటఁ గలయంగఁ బర్వఁ గొన ♦ గొమ్మను గోయిల మించ నొప్పెఁ జెం
గటి రొలయావిహార రుచి ♦ గందవొడిం గనుపట్టె నీ లతా
స్ఫుటతర చూచుకం బగుచు ♦ బొల్చు వసంతదిరగుబ్బచన్నునన్. 75

తే. వెలఁది యిచ్చటి సంపెంగ ♦ విరులు గహన, దేవతల యుండ్లనెత్తిన ♦ దీపశిఖలు
గాక యుండినఁ బంచబం♦గాళ మగుచుఁ, జాలునే? మత్తమధుకర ♦ పటలతమము.

చ. అపరిమితానురాగ సుమ♦నోలసరై చిగురాకుఁ జేతులన్
తపసిని గౌఁగలించె వని♦తా! యిదె రంభ దలంప రంభ దా
నపరిమితానురాగ సుమ♦నోలసరై చిగురాకుఁ జేతులన్
తపసిని గౌఁగిలించు టుచి♦తంబె కదా యన నవ్వె రంభయున్. 77

ఆ. కొమ్మ కన్నుఁగవకు ♦ గోరగింపఁగఁ జూచి, తఱచు జొత్తుగ్రిమ్మ ♦ దాసనంబు
గవియు నీతమాల ♦ గహనాంధకార వి,తానమునకు నుదయ ♦ భానుఁడయ్యె. 78

తే. శ్యామలోపరి నిబిడ ప♦త్రాభ్రమాలకుఁ, గాండమండంబు దిగువాన ♦ కాళ్లు గాఁగఁ
బంకరుహనేత్రి వర్షర్తు ♦ శంక నొనఁగు, పోఁకఁబోదియ నవకంపు మోకఁగంటె. 79

ఉ. చూతమె డాసి పక్వతర ♦ శుక్తి పుటాంతర దృశ్యమౌక్తిక
వ్రాతములై వెలుంగు గరు♦వంపుఁ గోటారుల నొప్పు తామ్రప
ర్ణితటు పట్లు జీర్ణదళ♦బృంద సమావృత పాండురప్రసూ
నాళి మనోజ్ఞమూలముల ♦ నర్థి సెసంగు మధూకసాలముల్. 80

క. పంకజముఖి విరహులపయిఁ, గింకన్ నిజసైన్యకోటి♦కిని సెలవిడు మీ
నాంకుని కరతల మన నల,కం కేళిం జిగురు గాలిఁ ♦ గదలెడు గంటె. 81

చ. సుమఁ జిగురాకు మేఁతయుతరి ◆ నూరికలంకులఁ దేఁటి గుట్టినన్
వనతరుశాఖలం గువకు◆వ ధ్వనిఁ బాఱు పికాంగనం బికం
బుచు నయమొప్ప మాన్పగతి ◆ నాత్మ ముఖంబు ముఖంబుఁ జేర్చి చుం
బన మొనరించె నందనుఁడు ◆ మాయలగా మగవారి కృత్యముల్.

క. అని పొగడుచు నొయ్యారపు, టనువున జడ లల్లి జిలుఁగు◆లగు పయ్యెదలన్
జనుకట్లు గట్టిగట్టిగ, ననిమిష కాంతలు లతాంత ◆ హరణోత్సుకలై.

రగడ. చెప్పుమీ నల్లయది ◆ నెఱులఁ దొలుపూఁ దుతిమె
దర్పణమున కర్పింపఁ ◆ దలఁప డెంతటి పెరిమె
యింతి పావురపు రొద ◆ రోల విని దారజము
వింతరో విరహిణుల ◆ వెతఁ బెట్టు బేరజము
సురపొన్న కొమ్మన్నలం ◆ సొచ్చి నలుగడ వెదకు
తరుఁగ దండులతావి ◆ తండంబు క్రొవ్వెదకు
నతిమినసుఁ జివురుసరు ◆ నగునె కంటక మాడఁ
బాలకు మనె పెరొక్క◆చోటఁ గంటక మాడఁ
గుందములు నీకొసఁగఁ ◆ గూర్చితిని గైకము
నిందులకు నెల యడుగ ◆ నేల విడు వైకము
చిలుదెంట్లు కొసఁగె గు◆జ్జనగూళ్లు గొజ్జంగ
నెఱఁగ కది పూవంద ◆ నేల యిటు రజ్జంగఁ
సదిరింపఁ బోలు నీ ◆ వింతి రతిపతిఁ దెగడఁ
బోదలఁ జిగురులు తొడలఁ ◆ బూచి యున్నది పొగడ
పుడుకు మల్లన గంద ◆ వాడికి నీ పేరింకణము
దడయ కిటు నీకిత్తుఁ ◆ దగరత్న కంకణము.
సెలవిపోఁ జూచెదవు ◆ నిలునిలువుమా కనము
గురియు తేనెలజేబు◆కొన్న దంతట వనము
కా దల్ల యది ఫుల్ల◆కంకేళి పన్నిదము
కాదు గోడిన నీడు ◆ ముత్యాల జన్నిదము
ఏటవాలైన యది ◆ యీ యరటి బాలెంత
చేటునకె యనుచూలు ◆ చేఁ గలుగు మేలెంత
నెలఁత యీ గేదంగి ◆ నీకబ్బె బుక్కాము
చిలుకు నీ పుప్పొళ్లు ◆ చెంచెతల బుక్కాము
మితిలేని తేనె సొ◆మ్మెత చేసె విరవాది
యితర లతికల మరగి ◆ యేఁగునది పరవాది
కలిగొట్లు ప్రాఁకు నే◆డ్కొలె నీకుఁ దలఁచెదను
నలినాక్షి కడిమి గం◆డమున కే నెలచెదను
గురువెంద నవ గిలుబు ◆ కొనియెఁ బయ్యెర దొంగ

విరులఁ గరికుంభకుచ ♦ వెరఁజూపె యని గుఱ్ఱంగ
మెర మెరని క్రొలనిదరి ♦ మీలించు లకుముకులు
మరిగె నీ కనుదోయి ♦ మా యింపు చకచకలు
ఏకాంత మని దోలఁగె ♦ దిండు నీ వటె వేలు
చేకొనవె మాన్నాడి ♦ చెలువ యీ వటివేరు
అరిది యీ యేడాకు ♦ లరఁటి నకు కప్పురము
సరిరావు డానికల ♦ శశిమొదలు కప్పురము
పాళ కల్లది పోఁకఁ ♦ బాగ్రఁకబంధము దగియె
నాళి యుడి దిగజారు ♦ నట్టి చందము నగిరొ
మలయ పవనునిఁ బిలిచె ♦ మావి బళి యీవేళ
మలయు కోవెల పంచ♦మస్వరం బను నీల
సులభమై దొరకె మం♦జులవాణి చంపకము
చిలుకవన్నెపుఁ బోదలు ♦ చేరి యిఁక వంపకుము
చనకుఁ డిఁక దవ్వునకు ♦ సఖులార పువ్వులకు
ననుచు నలరులు గోసి ♦ రతిప ల్లన డాసి. 84

క. నాళీకమధూన్మత్తమ, రాళీముఖరాళి సుఖక♦రంబగు క్రొలనం
గేళీ లాలస గతి డిగి, యాళీ నివహంబు లోల ♦ లాడెడి వేళన్, 85

ఉ. వాడిన మోముఁదమ్మి తెలి♦వాలిక కన్నులు విన్నఁబోవఁ దో
డ్తోడక నెక్కొనన్ కరము♦నందిడి తీరని వణ్ణయె జలం
బాడఁగఁ బిల్చువారి నొక ♦ హస్తపు ద్రెంకృన నాడుఁ డంచుఁ దాఁ
జూడక చూచుచూడ్కి నల ♦ జోటి దిశల్ పరికింప నొక్కచోన్. 86

మాలిని. రవిరుచిఁ దిసరేణు ♦ వ్రాతమల్ మించువాత్యా
నివహనిహతిలో ♦ నిందిందిరశ్రేణు లాడం
గువలయ ఘనకుల్యా ♦ కూలవల్లీవనీ సం
భవము లగుచు మింటం ♦ బర్వెపుప్పొళ్ల లోనన్. 87

సీ. కనిఁడి తోరము తోడి ♦ బాహు వల్లనయొత్తి, సారెకుఁ బొదలఁపైఁ జాఁచి చాఁచి
బింబాధరంబు గం♦పింప నొయ్యన విపంచీస్వరంబునఁ జట ♦ సెప్పి సెప్పి
దిశల మార్గాన్వేషి ♦ దీర్ఘలోచన దీప్తి, గణముచేఁ దోరణ ♦ గట్టి కట్టి
కమనీయతనుకాంతి ♦ కనకద్రవంబున, నారామరంగంబు ♦ నలికి యలికి

గీ. యానితంబవిలంబి కా♦లాహికల్ప, ఘనకచగ్రంధి నచటి భృం♦గముల కసిత
దీధితులు వడ్డికొసఁగుచు ♦ దేవపూజ, విరులు చిదిమెడి కపట భూ♦సురుని గనిరి.

ఉ. కాంచి కలక్వణత్కనక ♦ కాంచికయై యెదురేఁగి యప్పు డ
క్కాంచన కేతకీ కుసుమ ♦ గాత్రి వయస్యల డించి తన్నిరుం
జాంచలవీథిఁ దాఁకుచు ఘ ♦ నాంత చలచ్చపలాకృతిం గలం
గాంచిన వస్తువుం దెలిసి ♦ కాంచిన యట్లనురక్తిఁ గాంచుచున్. 89

ఉ. ఆ కమలాక్షి యింపున దృ ♦ గంచల మించుక మూసి హర్ష బా
ష్పాకులకోణశోణ రుచు ♦ లగ్గలమై నెమ్మునం జనఁ జూచు చూపు తీ
రై కనుపట్టెఁ దమ్మరస ♦ మంటుకొనన్ వెడవింటివాఁడు క్రో
ధైక ధురీణతం గలఁచి ♦ యేసిన నీలగిరీకోలయో యనన్. 90

సీ. తొలుదొల్త వానిఁ గ ♦ న్నులఁ గాంచినప్పు డప్పల్లవాధర గుండె ♦ జల్లుమనియె
నట రెండు మూఁడంజ ♦ లరుగ నప్పుడె కాళ్లు, బంకజాక్షికిఁ దొట్రు ♦ పాటుగదిరె
డాయంగఁ జనునప్పు ♦ డమ్ముఖాంబుజంబునకుఁ, గంబుకంధరకు దై ♦ న్యంబు దోఁచెఁ
గదిసి నిల్చిన యప్డు ♦ కనుదోయి చెప్పల, నలకకు మిగులఁ జం ♦ చలత చేరెఁ

గీ. కటకటా యనునపుడ గ ♦ ద్గదిక వొడమెఁ, జెఱఁగువట్టిన యపుడ లేఁ ♦ జెమట గ్రమ్మె
సొలసి మాటాడ నుంకింపఁ ♦ దలఁచి మోముఁ, దేలి కొనఁజూచునపుడ ♦ కన్నీరు వొడమె

క. పాటిత కరిదంతద్యుతి, పాటచ్చరగండఫలక ♦ భాగంబులపైఁ
గాటుక కన్నీరొలుకఁగ, మాట వెడలఁ గ్రేటుకొనుచు ♦ మానిని పలికెన్. 92

ఉ. ఏలర యీచలంబుడిగి ♦ యేలర బాలరసాల మాలతీ
జాలములో శశాంకకర ♦ జాలములో వలవంత నెత్రుపుల్
జాలుగ నాల్గుజాలు నిఁకఁ ♦ జాలు భవం బనునంత కాఁకయుం
బాలయి రాత్రి పంచశరు ♦ బారికిఁ జిక్కితి నీకు దక్కితిన్. 93

శా. రా వైరాగ్యముఁ బూని నీవు కడు ని ♦ ర్దాక్షిణ్య చిత్తంబునన్
రా వైతేఁజవిగాని యందులకు హా ♦ రాహారిగాఁ బోరి యే
లా వాలాయము సేయఁగా బ్రదుకు నీ ♦ వాచారవంతుండవై
చావో యెక్కుడొ నీయెడం బొడమె వాం ♦ ఛన్ భూసురగ్రామణీ. 94

క. కట్టఁడితనమున కిట్లాడి, గట్టి మనసు ప్రాయి సేసి ♦ కరఁగవు మతి నీ
పట్టినది విడువ విఁక ని, న్నిట్టట్టన నేల మా య ♦ దృష్టం బుండన్. 95

వ. అనిన నక్కుహనాభూసురకుమారుఁడు.

సీ. కొనసాఁగి కామినీ ♦ గోష్ఠిఁ బౌఢములైన, యడుటుఁ జూపుల ఱెప్ప ♦ తుదల సాఁచి
సంతసంబున ముఖా ♦ బ్జంబునఁ జిఱునవ్వు, కందళింపకయుండ ♦ డిందుపఱిచి
పొంగారుమైఁ దోఁచు ♦ శృంగారచేష్టల, దమిఁ దెచ్చి కోలు మౌ ♦ గ్ధ్యమున దాఁచి
పాడము రసావేశ ♦ మున వచ్చు నర్మోక్తు, లాదిని నాలుకను రా ♦ కుండ గుక్కి

గీ. మస్తకము వాంచి యుసు రని ♦ మౌనముద్ర, నేల బొటవ్రేల వ్రాయుచు ♦ నిలిచి కొంత
సేపు వెడవెడ చింతించి ♦ శిర సొకింత, యెత్తి సన్నంపు టెలుఁగుతో ♦ నిట్టు లనియె.

శా. తల్లిం దండ్రియు నన్నుఁ గానని మనస్తాపంబునం బొక్కఁగా
నిల్లాలార్తిఁ గృశింపఁగా సవనవహ్ని శ్రేణి చల్లారఁగా
నిల్లుం శూన్యత నొంది సొంపు చెడఁగా ◆ నిచ్చోట నేఁ జిక్కి యో
ఫుల్లాంభోరుహనేత్ర యే ◆ సుఖమతిన్ భోగించెదం జెప్పవే. 98

ఉ. ఓ సరసీరుహాక్షి విన◆వో రతిఁ గౌఁగిట నీవు చేర్చ నిం
పౌ సురభర్తకైనఁ గల◆దా వలదంచుఁ బెనంగ నేను స
న్న్యాసినె యొక్కఁడే తపాత◆హాన్మన సొగ్గదు కేళిపై ననా
శ్వాసిత దుఃఖితే మనసి ◆ సర్వ మసహ్య మనా సెఱుంగవే. 99

క. ఐనం గానిమ్ము భవ, ద్దీనతకై వ్రతము విడిచి◆తిం బరులకు మే
లైనం జాలు శరీరం, బైన నుపేక్షింపవే యయ ◆ నది యట్లుండెన్. 100

క. తివురక యిం కొక్కటి విను, కవయు నెడన్ వలయుఁగన్నుఁ ◆ గవయును మాయన్
భువి నిది యస్మద్దేశ, వ్యవహారము కన్నుఁ దెఱవ ◆ నఘమగుఁ దెలివా. 101

శా. ఈ మర్యాదకు నీ వొడంబడిన మే◆లీభంగి గాదేని మా
భూమిం జేరఁగ నెట్లు నీ యొసలితోఁ ◆ బోవంగ లేనే కదా
యీ మందాకిని పొంత నీ మునులతో ◆ నీ వృక్షవాటంబులో
భామా యేఁ దప మాచరింతు విధి క◆బ్రహ్మణ్యముం బెట్టుచున్. 102

తే. ఇంక నొక్కటి వినుము పూ◆ర్ణేందువదన, వ్రతము చెడ సౌఖ్యమైనను ◆ వలయుఁ గలుగ
వాంఛితము దీర నను నీవు ◆ వదలఁ జెల్ల, నేను నిను సమ్మతిలఁ జేసి ◆ యేగుదనుక.

వ. ఇంత యేమిటికంటేనిం జెప్పెద. నేను వైదేశికుఁడ. బంధు మిత్ర కళత్రంబులం బాసి
దైవయోగంబున నింతదూరం బేఁగుదెంచినవాఁడ. మీఁద భవదర్థంబు పాత్రీభూతుండనై
వ్రత హోమా ద్యనుష్ఠానంబులు విడువం గలవాఁడ నగుటం జేసి యంతరంగంబునం
గల తెఱంగు తేటపడం బలుకవలసె నాకర్ణింపుము. 104

ఉ. నీ చనుదోయి సంకుమద ◆ నిర్భరవాసన మేన నూన న
య్యో! చిరసౌఖ్యముల్ గనుట ◆ యొండెఁ దపంబొనరించి పాపముల్
రాచుట యొండెఁ గా శిహాప◆రంబుల కోరిక దూరమై వయ
శ్శ్రీ చన రెంటికిం జెడిన ◆ రేవఁడ నౌదునె నీరజేక్షణా. 105

క. అని యాస గలుగఁ బలికిన, విని వేలుపువెలఁది మోము ◆ వికసిల్లం గాఁ
దన చేతి చెఱఁగు బిగియం, బెనచుచుఁ దల వాంచి నగవు ◆ బెరయఁగఁ బలికెన్. 106

శా. హా! నీ నిష్ఠుర వృత్తి మాని కరుణా◆కాయత్త చిత్తంబునన్
మానం జాలనటంచు నేఁడు శ్రవణా◆నందంబుగాఁ బల్కుటన్
సూనాస్త్రున్ వెలవెట్ట కేలితి సుఖా◆ర్ణోరాశిలోఁ గ్రుంకితిన్
నానోముల్ ఫలియించె నా వయసు ధ◆న్యం బయ్యె విప్రోత్తమా. 107

వ. నీ వెట్లు చెప్పి తట్లు సేయం గలదాన నని యతని నొడంబఱచు సమయంబునం దోడి
నెచ్చెలు లచ్చకోరాక్షిం గూడికొని. 108

సీ. అకట నిర్దయబుద్ధి వని దూఱెఁ గడు రంభ, యాహా! వివేకివౌ దనియె హరిణి
చేఁదు మ్రింగెద వంచుఁ జెలికి నవ్వె ఘృతాచి, మాయలాడని తిట్టె మంజుఘోష
న్యాయ నిష్ఠురములఁ బ్రార్థించె నూర్వశి, జంకించె రమ్మంచుఁ జంద్రరేఖ
చెలి నేఁచి తనిదిసంతులుం గొట్టె మేనక, విడువు మాయలటంచు నొడిచె హేమ
గీ. గొంట వదరెఁ దిలోత్తమ కూర్మిఁ గొసరె, ధాన్యమాలిని పుంజికస్థల యదల్చె
దివిజకామిను లీరీతి దిరుగఁబాఱి, గువ్వకోల్గొంచుఁ దమలోన నవ్వుకొంచు. 109

క. ఆ కుహనాభూసురుఁ డపు, డా కాంతల సరస సమ్మదాలాపములం
గైకొనుచు ముదిత హృదయుండై కేళీవనము వెడలి యరిగి కుఱంగటన్. 110

సీ. మృగనాభి నికరంపు బుగబుగల్ గలచోటఁ, జదలేటి తుంపురుల్ చెదరుచోట
వకుళవాటీ గంధవహుఁడు పైకొనుచోటఁ, గర్పూరతరు ధూళి గప్పుచోటఁ
బసమీఱు చెలయేఱు లిసుక వెట్టినచోటఁ, జిగురు మావుల సంజ నిగుడుచోటఁ
నవమాలికల తీవె నట్టుట్టిపడుచోట, మాణిక్య దీపముల్ మలయుచోటఁ
గీ. బ్రమదమునఁ దేఁటు తెలుఁగుత్తి పాడుచోట, శారికలసంగ శాస్త్రముల్ చదువుచోటఁ
గీరకలకంఠములు క్రొవ్వి కేరుచోట, బావురము లాఁటజంబులు పలుకుచోట. 111

తే. ఆ వరూథిని మణిమండితాలయంబు, గాంచి యనురాగమునఁ బ్రవేశించి యంత
వారి నిరువురఁ గూర్చి య వ్వనజగంధు, లాత్మగృహముల కేఁగి రనంతరంబ. 112

క. ఫుల్లలవలీవశైలా, వల్లీ మల్లికలతోడ వాసంతిక లం
దల్లీల నల్లిబిల్లిగ, నల్లికొనిన యొక లతాగృహాంతర సీమన్. 113

క. ఆ గంధర్వకుమారుఁడు, నా గజగమనయుఁ బ్రఫుల్లహల్లక తల్పా
భోగంబున రహి మిగులఁగ, భోగింపఁ దొడంగి రాత్మఁ బొంగెడు కాంక్షన్. 114

వ. ఆ సమయంబున. 145

సీ. సహసానఖంపచ స్తనదత్త పరిరంభ, మామూల పరిచుంబితాధరోష్ఠ
మతిశయ ప్రేమ కల్పిత దంతసంబాధ, మగణితగాని శయ్యానిపాత
మతివేలమణిత యథేష్టార్గళచపేట, మతిదీన వాక్సూచితాత్మ విరహ
మంకుర త్పులకజాలావిద్ధ సర్వాంగ, మానంద కృతహార వాననాబ్జ
గీ. మాక్రమాతీర్ణ నుతివర్ణ మానిమీలితాక్ష మాస్విన్నగండ మాయత్తచేష్ట
మాస్తిమిత భావశారవ మా వధూటి, ప్రథమ సురతంబు గంధర్వపతిఁ గరంచె. 116

క. అన్నునఁ గనుమూయుట రోఁద, సన్నగిలుట కౌఁగిలింత ♦ సడలుట నేర్పుల్
సన్నగుట వరూథిని రతి, కన్నె తేకపు రతిసఖఁ బోలెఁ ♦ గడు నిం పొసఁగెన్. 117

క. ఈ విధమున న య్యిరువురు, భావజతంత్రైకపరత ♦ బహుకాలము సౌ
ఖ్యావహలీలల నుండం,గా వేలుపు ముద్దరాలు ♦ గర్భముఁ దాల్చెన్. 118

క. నడ జడనువడియె నా కేర్పడియెం జనుమొనలు నల్ల♦వడియెన్ వడియం
బడియెఁ గడు నొడలు పడఁతికి, బడలికయును నిదుర యరుచి ♦ బహుళంబయ్యెన్.

మ. పలుచం బాఱుటఁ గోమలస్మిత రుచుల్ ♦ పైఁ దోఁచె నా గౌరకాం
తుల గండద్వితయంబు పోల్చెఁ బ్రమదా♦ర్ణోరాశి ఫేలన్నవో
త్కలికా భంగపరంపరోప రిసము♦ద్యత్సాంద్ర డిండీర పం
క్తులు నాఁ జిట్టుము లుల్లసిల్లెఁ దఱుచై ♦ తోడ్తోఁ గురంగాక్షికిన్. 120

తే. నాళజలజాక్షి నిఱుపేద ♦ నడుము బలిసి, యల్లనల్లన వళిసీమ ♦ నాక్రమించెఁ
దేర్చి దివసక్రమంబున ♦ బీదబలిసి, బందికాండైనఁ బౌరుషులు ♦ బ్రతుకుఁ గనునె.

క. పాటలసుగంధి పాటలు, నాటులు లే కప్పు డొప్పె ♦ నలసతఁ బథిరో
త్పాటనజయపరిశ్రాంత, జ్యాటంకృతి చలనమదన ♦ చాపముఁ బోలెన్. 121

సీ. మనను కప్పు తెలి మెల్లన లేచి చేతులఁ, గాంతుని జబ్బుగాఁ ♦ గౌగిలించు
నలసత మృద్గంధి ♦ దైన కమ్మనినోర, నధరంబు నెడనెడ ♦ నాని కూర్కు
మణితాది పవనధా♦రణ శక్తి చాలమి, నొయ్యన నర్మోక్తి ♦ నుబ్బునర్చుఁ
గాంక్షిత క్రీడ కం♦గము పంపుసేయమి, నొడ్డుగా నిట్టూర్పు ♦ లోలయఁ బొగులు
గీ. నిచ్చ యొఱిఁగిన రతికేళి ♦ మెచ్చి పొగడుఁ నప్పు డక్కాంత రతి పరి♦హాసవేళ
జీవితేశు సమేళంపుఁ ♦ జేఁత లడుపు, ప్రార్థనాపూర్వ దీన సం♦భాషణముల. 123

క. అంత వియచ్చరుఁ డభిమత, మంతయు సమకూఱుటయును ♦ నచ్చర గర్భ
శ్రాంత యగుటయును గనుఁగొని, యింతట నిచ్చోటు వాయ ♦ కే నిఁక నున్నన్. 124

క. వంచన యొఱిఁగిన మఱి శపియించునొ సురకాంత చెప్ప ♦ కేఁగినఁ బ్రేమన్
పంచశరశర పరంపరఁ, బంచక ప్రాపించి మీఁదఁ ♦ బాపం బిడునో, 125

వ. అని వితర్కించి యక్కపటవిప్రుఁ డెఱింగించి యనిపించు, కొనియ పోవువాఁడై
యప్పు డప్పర్వతంబు డాయం బోయి బుజ్జనం బొప్ప నిట్లనియె. 126

తే. ఎవ్వఁ డేఁ బాడలేప మొక్కింత నాదు, పాదముల బూయ నింతేసి ♦ వసులు పుట్టె
న మ్మహాయోగి బహుయోజ♦నాధ్వయాము, యీ గిరికి నేఁగు డాచె నేఁ డేఁగి కంటి.

క. అతఁడు మతి దీర్ఘయాత్రా, వ్రత వశమున వచ్చి మా పురంబు తెరువుగాఁ
గతలుగ మా సంసార, స్థితు లెల్లను జెప్పె నేమి ♦ సెప్పుదు నబలా, 128

సీ. పై పరామరిక చేప్పడమిఁ బక్కముఁ దప్పి, పండఁబాఱిన పొల ♦ మెండఁబాఱెఁ
గట్టఁ గాపింప దక్షత లేమి నూరూర, బందెల బడిపోయెఁ బసుగణంబు
వంచనామతిఁ బ్రాడ్వి ♦ వాకులై వటువు లా, జ్జల కొప్పగించిరి ♦ చదువు లెల్ల
గికురించి రిచ్చి పుచ్చుకొను చోటులవార, లాఁకకు లోనుగా కప్పు లీఁక

గీ. గ్రహణ సంక్రమణాదుల ♦ రాచనగరఁ, గాను వీసంబు వెడలమి ♦ గ్రాసమునకు
నాధి వెట్టిరి క్షేత్రంబు ♦ లందుఁ గొన్ని, లెస్స యుండునె గృహకర్త ♦ లేమి బ్రతుకు.

క. అది గాక నేనిట వచ్చిన, యది మొదలుగఁ జింతచేఁ ♦ నహర్నిశమును నా
కెదు రెదుర చూచు నిద్దఱు, ముదుసళ్లును పుత్ర మోహమున నగు నార్తిన్. 130

క. తడిగంట నెపుడు దఱుఁగక, కడి దఱుఁగఁగ వడియుఁ దలఁగి ♦ గాసిం బడమిం
బడిన గనరాక మంచపుఁ, దోడుగలై రట్టె రుజలతో ♦ నేమందున్. 131

క. కావున వారలఁ జూడం, గా వేగమ చనఁగవలయుఁ ♦ గమలదళాక్షీ
నీ వెఱుఁగని ధర్మాధ, ర్మవ్యవస్థితి గలదె దీనికై యడలకుమీ. 132

క. వడిఁ గాఁచి కాఁచి యుండం, గడవల నీ రిసుముఁ ద్రావు ♦ కైవడిఁ బైఁబై
బొడమెడు కోర్కులచేఁ బె, ల్లుడికిన మది భోగముక్తి కూటట గనునే. 133

ఉ. కావున నెన్నఁడుం దెగని ♦ కాంక్ష నెపం బొకఁ డెన్ని కోని నేఁ
బోవఁ దలంతునేని వలపు న్మనుపుం దగవుం బ్రియంబునున్
నీవలనన్ సమగ్రములు ♦ నిల్చిన సంపదఁ గ పువ్వు దేనె కొ
త్తావికిఁ దేఁటి చిక్కిన విధంబునఁ జిక్కనె లోలలోచనా. 134

ఉ. ఎవ్వడు మీఁ దెఱుంగక యథేచ్ఛ సుఖైక రతిం జరింపఁగా
నవ్వల వంశహాని వ్రతహాని యశోధనహాని పుట్టుఁదా
న వ్వెడఁ గ మ్మనుష్య పశువయ్యు వివేకి చెడున్ జగంబునన్
నవ్వఁగఁ బాలు రౌరవము ♦ నం బడఁ బాలును నిందపాలునై. 135

మ. అనినం జిత్తము జల్లనన్ సొరుగు నయ్యంభోజపత్రాక్షి లో
చన గోళంబులఁ జిమ్మలై చిలుపలై ♦ జాలై తరంగంబులై
చనుదోయిం గొనబో కురంగమదచర్చల్ జాఱిపో నొక్క మొం
డున బాష్పాంబుర్ఝురంబు లుప్పతిలెఁ బోటుం బాటుగా నెంతయున్. 136

క. అత్తఱి గంధర్వవిభుం, దత్తామరసాక్షి వదన ♦ మక్కునఁ గృపతో
నొత్తి మొగ మెత్తి యశ్రులు. మెత్తనఁ గొనగోరఁ బాఱ ♦ మీటుచుఁ బలికెన్.

శా. ధీరస్వాంతవు వంత నీకుఁ దగునే ♦ దివ్యాంగనల్ కోవిదల్
గారే యోగవియోగముల్ సతమౌనే ♦ శర వ్యాపాల్ సేయరే
పోరే రార ప్రియంబు గల్గిన జనుల్ ♦ పోరామి పోఁ బోవునే
పో రాకుండఁగ నేమి కాళ్లు దెగనే ♦ ఫుల్లాంబుజాతేక్షణా. 138

తే. మూలముట్టుగఁ జెప్పెన ♦ మ్మునివరుండు, ప్రార్థితుండయి నాకున ♦ ప్పరమ విద్య
వచ్చుచును పోవుచుండెడ ♦ వదల నిన్ను, శుకకలాలాప ననుఁ దిశుద్ధికినిమ్ము. 139

తే. అని వరూథిని నూరార్చి ♦ యచటు వాసి, పోయెఁ దనయిచ్చ గంధర్వ ♦ పుంగవుండు
తప్పరాదు ఋణానుబంధంబు దెగినఁ, బ్రాణపదమైన వలపును ♦ బాసిచనదె. 140

వ. అనుటయుం దరువాతి వృత్తాంతంబు గృహాయత్తంబగు చిత్తంబున నానతీయవలయు
నని యడుగుటయును. 141

శా. హిందూరాజ్యరమా ధురంధర భుజా ♦ హీరాగ్రిమణీ కంచుక
త్కుంద స్వచ్ఛయశో గుళుచ్ఛ యసన ♦ క్షోణీ ధన స్థాపనా
మందీభూత కృపాకటాక్ష యసకృ ♦ న్మాద్యత్కళింగాంగనా
బందీగ్రాహవిగాహితోత్తర కకు ♦ బ్ధాటీ సమాటీకనా. 142

క. తిరుమల దేవీ చరణో, దరళాక్షా కల్ప కల్పి ♦ తస్థల కమల
స్ఫుర దిందీవర బంధుర, హరిహయమణివలయ కూట ♦ హర్మ్య విహారీ. 143

ఉత్సాహ. వర్ణనీయ కీర్తి వైభ ♦ వా పరిభూత భూతి దృ
క్కర్ణకుండలా! వితీర్ణ ♦ కర్ణ! దీర్ణహృద్భ్రమ
ద్దుర్ణయారి మానహారి! ♦ దుర్భరానకార్భటీ
ఘూర్ణమాన కొండపల్లి ♦ కొండవీటిమండలా. 144

ఇది శ్రీమదాంధ్ర కవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్ష
పాదాంబుజాధీన మానసేందిందిర నందవర వంశోత్తంస
శరకోపతాపస ప్రసాదసమాసాదిత చతుర్విధకవితామతల్లి
కాల్లసానిచొక్కయామాత్యపుత్ర పెద్దనార్య
ప్రణీతంబయిన స్వారోచిషమనుసంభవం
బను మహాప్రబంధమునందుఁ
దృతీయాశ్వాసము
సంపూర్ణము.

---

శ్రీ

# స్వారోచిష
# మనుచరిత్రము

# చతుర్థాశ్వాసము

శ్రీకృష్ణరాయ గుణర,త్నాకల్పా కల్పకద్రుమాధిక దాన
శ్రీకుతుకాగతలోకా, లోకాంతర సకల సుకవి ♦ లోకస్తుత్యా. 1

వ. అవధరింపుము. జైమిని మునీంద్రునకుఁ బతంగపుంగవంబు లిట్లనియె. 2

సీ. మనుజుఁ డప్పారికార ♦ మూనఁ గూడుచోఁ శంకఁ, గనుమాయఁ బఱచి నా ♦ ఖచరభర్త
యవ్వరారోహయు ♦ నాసక్త కావున, నిచ్చతో నటుసేయ నియ్యకొనియె
నా ప్రతిజ్ఞా పూర్తి ♦ యయ్యెఁ దనంతే న, వ్వనితకు రతిపార ♦ వశ్యపటిమ
నపుడు తత్ప్రవర దే ♦ హసమిద్ధ శిఖిదీప్తి, శాంబరీ మహిమచే ♦ సంగ్రహించి

గీ. నట్టి గంధర్వమూర్తి సా ♦ ఖ్యానుభూతిఁ, జలనమేదిన మానసా ♦ బ్జమున నిలువ
వెలసెఁ దేజోమయంబైన ♦ వృద్ధి నట్టి, మేటిగర్భంబు నెలలు తొ ♦ మ్మిదియు నిండె, 3

వ. అనంతరంబ యొకానొక పుణ్యదినంబున. 4

శా. తేజం బబ్జభవాండ గేహమునకున్ ♦ దీపాంకుర చ్ఛాయమై
రాజిల్లన్ గ్రహపంచకంబు రవిఁ జే ♦ రం బోని లగ్నంబునన్
రాజీవాక్షి కుమారుఁ గాంచె సుమనో ♦ రాజన్యమాన్యుల్ జనుల్
జేజే పెట్టఁ బ్రసూన వర్ష మమర ♦ శ్రేణుల్ ప్రవర్షింపగన్. 5

క. స్వరుచి స్ఫురణను శశి భా,స్కర పావక తారకా ప్ర ♦ కాశము లెల్లన్
విరళములు సేయ నతనికి, స్వరోచి యను నామ మిడి ర ♦ చటి మునులెల్లన్. 6

చ. మఱియు నతండు సంయమి స ♦ మాజవినిర్మిత జాతకర్ముఁడై
క్రతిఁ బరివర్ధితుండు నుప ♦ నీతుఁడునై వివిధాయుధంబులన్
కుశలగరిష్ఠుఁడై రణస్థలుల ♦ గద్దరియై నిగమార్థవేదియై
కలితకలాఢ్యుఁడై మెలసె ♦ నిర్మలకాంతి విలాసరేఖలన్. 7

—:స్రగ్ధర:—

గుహ్రద్దన్ గోత్రాచలంబుల్ ♦ గులగుల లయి పో, గోత్రముల్ గ్రుద్దులీలన్
ఖిద్ధిం జెందం గడు మార్తరుల్ ♦ కవ్వుఁగిటి క్రొలందుల్, కత్తి నొక్కొక్క ఘాతం
బ్రోద్దామ ప్రార్థి వాశా ♦ ద్భుతగతిఁ బరచున్, భూమిజవ్యాజగా ని
ట్లుద్వీపి నందనుం డత్యనుపమబలుఁడై, యాత్రావనారంభ వేళన్. 8

క. వేదండము తొండము సరి, కోదండముఁ దివియు నెడమఁ ♦ గుడి నిబిడజ్యా
నాదము రోదసి నిండఁగ, భేదించున్ గండశిలలఁ ♦ బృథుబాణములన్. 9

క. అతఁడు మతి తనకు మంథ,క్షితి భృత్తటి విశ్వకర్మ ♦ చేసిన నగరిన్
వితతాట వికచమూసే, వితుఁడై సామ్రాజ్య మనుభ♦వింప నొకతఱిన్. 10

క, కరకాచిటు పటరవ భీ,కరమై పెళపెళనినాద ♦ ఘనమై ఝుంఝూ
మరుదుజ్ఝిత బిలమంద్ర, స్వరమై యఖండ నొక్క ♦ వర్షము గురిసెన్. 11

క. తెలతెల వేఁగిన నగ్గిరి, జలజల ప్రవహించు సెలల ♦ చప్పుళ్ళు శిఖా
వలపులకల శేఖరకల, కలములు గల తలపోలంబు గనుఁగొను వేడ్కన్. 12

ఆ. అన్నగాగ్ర మెక్కి ♦ యందొక్క శశికాంత, వేదిఁ గతిపయాప్త ♦ శేష్టితుండుఁ
గుటు జనిపిన పవన ♦ సటదలకభరుండు, నగుచుఁ బొద్దు జరపు ♦ నవసరమున. 13

ఆ. ఒక్క యెలుకు ఱేఁడు ♦ నక్క కొమ్మను సిత్రి, గోజంబు జొన్నఁ ♦ జాలపవ్వ
బీలిగలు లయంప ♦ కోలలు సెలవిండ్లు, గాను కిచ్చి కరయు♦గంబు మొగిచి 14

వ. యుగనిగమసమయ సముద్భూత జీమూత పటలంబునుంబోలె శైలాస గిరినితంబ ప్రాంత కాంతార పర్యంతంబు నిరంతంబై కాలుకొన్న యొక్క గహనకేళిం గరాంగుళిం జూపి భూపతికిట్లనియె.

క. అల్లదె కంటే పొనపొన, దెల్లనిగట్టలుత మబ్బు ♦ దెఱదు పొల మం
దెల్లెడఁ జూచిన ధరణీ, వల్లభ ! సీరాము సేవ ♦ వాలు మేకంబుల్.

సీ. కండూతికై రాయుఁ ♦ గర్కశం బగు తుంటిఁ, బీఁటవెట్టిన మ్రాను ♦ పెల్లగిల్లఁ
జెవి దార్చి విని చీమ ♦ చిటుకన్న నొకసారి, సెలవి వెంపరలాడు ♦ జిట్టెల్ల
జప్పరించు వెదుళ్ళు ♦ సటలుబ్బ దంష్ట్రాగ్ని, చొంగపైబడి చుంయి♦చుంయి మనఁగఁ
జండ్రి నిప్పులువోలెఁ ♦ దింగ్రిచు కనుమించు, తెసఁగ నొండొంటిపై ♦ నెక్కఁ బాలు
గీ. వెట్టదినముల పడుఁగుల ♦ మట్టికలఁప, బుడబుడ ధ్వని వెడలు బు♦ద్బుదములందు
జిలుప చిలుపని నేతుల ♦ జిడ్డుదేలు, నేమి చెప్పుదుఁ గొప్పిన ♦ యేకలములు. 17

చ. బలి మిఁక నేమి చెప్ప విను ♦ పండు వెదుళ్లవలీల మోఁగత్రొ
పులఁ బడఁజొప్ప వంచికొను ♦ పోలిక వంచి తరగ్రధాన్యముల్
సెలవుల ఫేన మట్టిపడ ♦ జిట్టలతోడ నె చప్పరించు వ
ప్పాలము వరాహపోతములు ♦ భూవర తొండములేని యేనుఁగుల్. 18

క. పాడిచిన కైదువునకుఁ జము, రిడఁ గావల దగ్గికాఁక ♦ యించుక యిడినం
జెమ్మగట్టల గుచ్చిన నం,జూడు మంటలఁ దగిలి నెయ్యి ♦ బొటబొట వడియున్. 19

తే. వలదు కుక్కల విడువంగ ♦ వలవ దేయ, నడచి మొలపిడి యమ్మునఁ ♦ బొడువవచ్చుఁ
బంకమున గొరిజ దిగఁబడెఁ ♦ బలియ లేవు, మున్ను లివ్వేళ రేగటి ♦ మన్ను లందు. 20

క. పొద చెదరి పోఁద చఱచిన, యొద్దఘులతో నాల్గు రెండు ♦ నొకటియుఁ బ్రింగల్
వెడలిన కొమ్ముల బలువున, నడుగిడఁగా లేవు బలిసి ♦ యందలి దుప్పుల్. 21

ఆ. చలము లోడవ మాండ్లు ♦ గల మ్రాకుఁ దీములఁ, గరలి తాఁకి గొమ్మ ♦ లురులఁ దగిలి
వాని లేవ నీడ్చి ♦ కానకే కొనిపోవుఁ, బొరలించి యిట్టి ♦ పోతు లచట. 22

ఆ. కప్పువెట్టి వెన్ను ♦ కందమ్ము సమముగాఁ, బొదలి జొల్లు గట్టి ♦ పొరయ మంచి
మలయఁ గాని పోవు ♦ మానిసిఁ బొడఁగన్న, నేమి చెప్ప వాని ♦ యీను లధిప. 23

క. కట్టియుఁ జేకొని డేగం, బట్టి యురుబునుపోకఁ బోలమా ♦ మట్టినఁ జాలుఁ
బొట్టిన కొర్రువ్వలు గలయవి, చెట్టడిచినఁ జేటఁ డేమి ♦ చెప్పం బులుఁగుల్. 24

తే. ఉడుము గిరిమిడికొమ్మకందం ♦ దడియు వెల్ల, యొలుఁక కల్లెల్క తఱచును ♦ నేమి చెప్ప
నడవి నెల్లెడఁ జూచిన ♦ నవనినాథ, జల్లెడయుఁ బోలెఁ లాఁగల నుల్లసిల్లు. 25

క. అనుటయు మృగయాకౌతుక, మునఁ జిత్తము చెంగలింప ♦ భూధర శృంగం
బున నుండి డిగ్గి నగరికి, ననిమిష కాంతాకుమారు ♦ డరిగి రయమునన్. 26

వ. నగరు సొచ్చి యచ్చటం గక్ష్యాంతర శాలాంతరాళంబుల నందంద తండతండంబులై వ్రేలు నత్తెంబులం జమురంటు ఫలలకండంబుల మండితంబులగు నిడుదవెదురు దండెంబుల బర్హిబర్హ నిబద్ధాగ్రంబులై కొమరారు దోరెపుఁ దార్లతోడం దిరుగుడుల వెడంగునడి వడిదప్పనట్లు తాళ్లం గట్టువడి పొట్ట లదురంగ నిక్కి వరిసెనంబులు వేయునవియును, నపహసిత శార్దూల కుటిలనఖకోటి పాటవంబు లగు తోలుటి పుటంబులం జటక సరటాది జంతు కళేబరంబులం జరణ నఖరాంకురంబుల నొత్తి చీఱుచుం గేరునవియును, నాఁడునాఁటికిం బాటించి పేఁటగాం డ్రొద నొఱంగి మేలుమేలుల చమత్కారంబుల నిరాకరించి పేరునం దిరిగి తిరిగి యీఁకదీర్చుకొనునవియును, బద నగ్గలించి కూయుచుం గళుకు నకనకంబడం గనుకట్టుతోడ మోములు వలంచుచుం బంజరస్థిత కీర శారికా పారావతాదుల పలుకు లాకర్ణించి యెగసి యెగసి నిజావస్థితతాదృగ్విధాధార వేణుయష్టులకుఁ జుట్టుపలం జెదరం బ్రదక్షిణ భ్రమణంబులం బరిభ్రమించి మగుడ నెట్టకేలకు మట్టుకొనునవియును, మేరమీఱ దిన్న యొరల నన్నుకొని యరగన్ను వెట్టి బొరకడం బొటమరింపం గూరుకుచుం గుతికిలం బడు నవియును నై పఱఁగు పలుదెఱంగుల డేగ మొత్తంబులను గుత్తంబులగు మిగుల నెత్తని జలపోత తోలు పట్టెడలు మెడల నమరంబు సుపార్శ్వ కట్టుఁ గంబంబులకుం దార్చి బంధించిన కుందనంపు గొలుసులు గలుగల్లు మనఁగ నొడళ్ళు జాడించికొనుచుం గొనసాగి సోగలై మ్రుంగిన మోరలుం బోనిమోరలు సారెసారెకు నెత్తి బయలు పసిపట్టుచుఁ గట్టెదుటి వాజిశాలలం గట్టిన పొట్టేళ్ళకై యాడికొని నీల్గి కాలం ద్రవ్వి ఘనఘనాఘన ఘుర్ఘురధ్వాన సమధ్వనులు చెలంగ మొఱఁగుచు నింగిఁ బ్రాఁకుచు నింగలంబు లుమియు నయనగోళంబుల నాభీలంబులై వివృత వదన గహ్వర విలంబి జిహ్వా పల్లవంబులకుం గ్రూరతర దంతకోటి కాంతికలాపంబులం గోరకస్తబకయోగంబు

గల్పించుచు నల్పేతరగ్రస్తకీలాల పలలఖాలగ్రాసంబులం జెన్నడుము సన్నఁదనంబున నట మిగుల డిగ్గి చన కునికిం గటితటంబులకంటెఁ దారె పుటపుట నయ్యె ననం దోరంబు లగు బోరల గందంబుల నందంబులు గని బిరుదు లంకించి తమ్ము నుపలాలించి పరిపాలకుల సంస్తవంబులకుం జెవి వార్చె ననం గర్ణసలయంబులు వ్రాలంబడి వెండిగుండులుం బోలెఁ గన్నులపండువులై గండభైరవు పూజావారువంబు లన మెండుకొని యుండు జాగిలంబులునుం గాంచి యానందానందుఁడు వేఁటకు నుఱువైన వాని నేర్పఱించి తెచ్చుటకు ననుచరుల నీవు నీవని నియమించి తానును నాఖేటకోచితపరిపాటి సన్నద్ధుం డయ్యె నయ్యవసరంబున.

సీ. పచ్చని హురుముంజి ♦ పనివాగె పక్కెర, పారసి పల్లంబు ♦ పట్టమయము
రాణ నొప్పారు హై ♦ రాణంబు సింగిణి, తళుకుల కోరుల ♦ తిరకసంబు
మిహి పసిండి పరుంజు ♦ మొహరాదా కెలంకుల, రావు గుజ్జరిసేఁత ♦ కేవడంబు
డాకెలంకున సిరా♦జీక రాచురకత్తి, కుఱుఁగటఁ గ్రొవ్వాఁడి ♦ గొరకల పొది
గీ. పీలికుంచె తలాటంబు ♦ బేరజంబు, మణుల మొగమట్లు వన్నె సా♦హిణి యొకండు
కర్త యెదుటికిఁ గొనివచ్చె ♦ గంధవాహ, బాంధవం బగు నొక మహా ♦ సైంధవంబు
క. తెచ్చుటయు నిచ్చ మెచ్చి మ,రుచ్చటుల కురంగరయని♦రోధిస్ఫురదగ
రోచ్చం బగు నత్తేజ ము,హృచ్చక్రిం బలర వేగ యెక్కి వెడలినన్. 29

చ. జడలు మలంచి చొళ్లెముగ ♦ సన్నపుఁ బాగ లడంగఁ జుట్టి చ
ల్లడములు పూని మీఁదఁ బది♦లంబుగఁ గట్టిన మట్టికాసెలం
బిడియము లంటఁ దోపి పృథు♦భీషణ బాహుల సాళువంబులన్
దడవి కిరల్చుచుం జనిరి ♦ నాథుని మ్రోల నృపాల నందనుల్. 30

సీ. ఇవి కంఠపాశంబు ♦ లింతడుసిన్న మీఁద, బడిదికాకరి హైన ♦ గడపఁ జాలు
నివి మింటఁ బఱచు ప♦క్షీంద్రుఁ జూపిన నీడ, బడి వాలునందాఁక బఱఁవజాలు
నివి గాలి కనిన మూఁ♦క వరాహ దనుజేంద్రు, నైన జొట్టెంటిలో నాఁగజాలు
నివి కాటుకొల్పిన ♦ వృద్ధ కూర్మము వీఁపుఁ, జిప్పైన నొఱచిక్కై ♦ చింపఁజాలు
గీ. ననగఁ ఘుర్ఘురగళగర్త ♦ జనితభూరి, భూభృదురుబిలభరిత భౌ ♦ భౌ భయాంక
రాస్ఫుటీదీర్ణదిగ్భిత్తు♦లగుచుఁ జెలఁగె, సరిపెణలఁ బట్టి తెచ్చిన ♦ జాగిలములు. 31

చ. పులియుఁడు బూచిగాఁ డసుర♦పోతులరా జనుమంతిగాడు చెం
గలువ సివంగి భైరవుడు ♦ గత్తెర సంపఁగి వెండిగుండు మ
ల్లెలగుది వాయువేగి చిటి♦లింగడు సాల్వుఁడు వత్సనాభి యే
కలములమిత్తి గబ్బియనఁ♦గాఁ గలవాని గ్రహించి యుద్ధతిన్. 32

ఉ. కట్టిన నీలి దిండ్లు నెల ♦ కట్టియ లిండ్లును విండ్ల గాసెనల్
చుట్టి నొసళ్లపై నిడిన ♦ జుంజురుఁ బల్లసిగన్ గటీతటిన్
బెట్టిన యొరాటుకత్తులును ♦ మేనులఁ గార్కొను కప్పులేర్చి చేఁ
బట్టిన వేఁట యమ్ములును ♦ బాగగు వాగురికుల్ మహాధ్వనిన్. 33

సీ. నట లెత్తుకొని యొత్తు ♦ కిటినైన మోటాస ♦ పడి యేయఁ జూడుతు నీ ♦ పాదమాన
కలగుండువడఁ జెండు ♦ కరినైన జెవి పట్టి, బలిమి మై దెత్తు నీ ♦ పాదమాన
సెలవెప్పు కొనిరొప్పు ♦ పులినైనఁ బీడించి, పడవైతుఁ జొచ్చి నీ ♦ పాదమాన
తెరఁదూఁటి వెరఁగాలు ♦ గునుపోతు పైనైనఁ, బడి యెక్కి పొడుతు నీ ♦ పాదమాన

గీ. యితర దుర్బల మృగపంక్తు ♦ లేమిలెక్క, కండ గరువంపు మాటలు ♦ గావు సుమ్ము
చూడు మమ్మని పంతంబు ♦ లాడుకొనుచు, న వ్వరూధిని సుతుఁ గొల్చి ♦ యరిగి రపుడు.

ఆ. ముష్టిగదల నత్తె♦ములనుండి యెగురుచుఁ, బదనుమీఱి నెరల ♦ వెడఁద డేగ
పదువు వట్టి దండ♦పాణులై నడచిరి, విధుని గడలఁ జేగ ♦ వేటగాండ్రు. 35

ఆ. గూని వీపులదర ♦ గొణఁగి తిట్టుచు సేకుఁ, గఱచినట్టి కుక్క ♦ గండ్లనంగ
మూఁతి నరప మీస♦ముల బోయ ముదుసళ్ళు, పంది వలలు మోచి ♦ పఱచి రపుడు. 36

వ. ఇట్లరిగి యమ్మహారణ్యంబు సొచ్చి విచ్చలవిడి నచ్చటం బచ్చికబయళ్ల మచ్చిక
ల్లచ్చుపడం దటిచ్చటులంబగు లోచన ప్రభాపటలంబు దిక్తటంబులం బర్వఁ దాఱు
మాఱుపడ నిడికొనిన మొగంబులతో నేణీజిహ్వాగ్రల్లవో ల్లిహ్యమానాంగంబులగు
సారంగంబుల ఖుఃఖికారంగంబు లనం గనుపట్టు చెలికపట్టులం గు బిట్టెసంగు నాఁకటం
దట్టువడి పొట్టకై పుట్టకూటికిం జీమఃకుం జెదలంనకుం నెలుంగులు గులగులంబట్టలు
నిశితనిజనఖరకులిశగోటులం గోరాడ నాడంద గాచుకొని యుండి వెడలి చను విష
విస్ఫురద్భుజగంబుల నల్లడం గబళించి గంటకుండ దంటు చప్పరించు గతిం జప్పరిం
చుచు నొండొంటికిం జేరంబులు వాఱి కుప్పించి తప్పించుకొను దుప్పుల ఖురజరజ
శ్ఛటల నెసకొ మెసంగు మసమసకల మఱుఁగుపడియుండు గండోపలంబులును పరి
హాసితసితేతర పాషాణ పాటవంబు లగు కిపాణపరిఘుంబు లొండొకికిం దాకి కత్తిల్లు
పెత్తిల్లు మనంబోరు కారుపోతుల కోలాహలంబులం బ్రిది శబ్దంబు వీనుకోనలును మద
మొందవ నెదపదనుంబొదలం పెట్టులతుం జొట్టంబులై చిల్లరసలుగులం బిల్లలం జుల్లరం
బుల సాంనిచ్చు గమికి వెనుకయై మలయుచుం బిఱుదం దిరుగు చిరుగున్నలకు వెన్నాడు
తోడేళ్ల నివంగులం దిరిగి తిరిగి మొత్తి పోనొత్తి చరియించు నేక చరంబుల
ఘుర్ఘుర ధ్వానంబుల ఘూర్ణమానంబు లగు పరిగపక్కపలు మేరుకేఁకువేము ఫులుగుడు
గురివెంద యూడుఁ గేలంగి మేడు గారు కోరిందకరుమ కారుగు వెంగలగు పొదలం
బొదువగు నానావిపిన పాదపకలాపంబును మాటిమాటికి మానిసి కాటుమఱఁగి
తెరువులం గాచి కాచి దగ్గుత్తికపడం దిను పెద్ద పొలవఱనం బుటుపుట్టలై తుప్పళ్ళు
డుళ్ళు కుళ్ళు గంతులిడు గబ్బి బెబ్బులుల నలఁగుడుల దొడ్డనంబులు మంత్రించి
పోరకదిగిచిన నీరు మేపు డిగి గిఱులు కొక్కుదల వాపోవుచుం దిరిగి తిరిగి వాకట్టు
విడచినప్పుడు దప్పికై వాఱి సెలయేటి కెంపులం బాఱమ్ములు బోమ్మ కెలంకులం
గాఁడ గాండ్రు గాండ్రుమని రొప్పి నోప్ప తుప్పరంబుగా నియత్తలంబునకు వ్రెల్లెత్తు
పొడవు వెగసి నెత్తురులు గ్రక్కుచుఁ గూలంకొఱ్ఱెల్ప్వలుల ఘుర్ఘురధ్వనుల గుండియ
లవిసి కలగుండువడు కారండవంబుల పక్షపుట పటాత్కారంబుల బోరుకలంగు
సెలయేటి కెంపులును మేంత వెంబడిం బొలము పల్లంబులం దిరిగితిరిగి పెంట్రికలు

పెట్టు, వెంటపట్టునదు వచ్చి యచ్చటం గుఱిచ్చి కానరాకుండ మునుమున్న మృగ
యుండు బిసరుఁబ్బడ్డి సంఘటించిన జాలిపోనులం బడి బెగడక యుద్దారు పీడ్చికొని
యీరములఁ దఱియంబడి యవ్వలికై వెడలి చనలేక గడసి తన్నుకొను మన్ను
మెకంబుల యాక్రందనంబులం గ్రందుకొను విషమప్రదేశంబులను జిలుగుగండ్ల
గమిచేత దైవికంబున డాపక్క మీఁదువడ దాటువడి యవి గొంతుకొ్రిన్నెత్తురు
గ్రోలి విడిచి చన మార్కొడలు వడి మశకవనదంశమ్ములు మూఁగ మాగంబాతిన
కొండగొఱియ మాఱుగడు బొందులకు సందడించు కంకగృధ్రావళుల మొల్లం
బుల మానుంగుపడు పల్లంబులను మేయుతఱి వీఁ పెక్కి తేఁచోగటిమాఱురంబు
కరచి కరచి రొంచి పడవైవం దోడి యొక రెండుమూడు వెనుక మూంగలు నందందఁ
గాళ్ళం బెనంగుచు నత్తునకై లేచి యేచి తినఁగా వెడలిన రుడమండు తద్వేదనకుం
గాక మట్టలెత్తుకొని యెత్తుగల పొనరుటడవులం చోరంబారు పిడికడితిక దుప్పను
రవడికి విఱిగిపడిన విటపివిటపంబులం దడుకుపాడిచినగతినొండు నెడలను బదులు
పదులునూఱులునూఱులు వేలువేలు గుములుగట్టి దట్టంబగు నెయ్యంబున నెదుర
బియ్యంబు లొండొంటికొసంగఁ గరివరకరేణువులు వంప మూంపుచెడి యిట్టటుపడి
తిట్టలగు జిట్టల సంకటంబులగు డొంకలు నీక్షించి హర్షించ యొక్కడుఁదమి నొక్క
రొడ నడుగువెడలని టెంకిఁ గని వాఱుగవులునరు మెకము దిగదని యున్ని మన్ను
మూర్పెత్తించి గాలి పరికించి దిగువదెస దొడ్డివల పన్ని యెగువ పొలిమేర
బారాది యగు దూరం బేఁగఁ బోగువాటించి యత్రాిట వలమోవం బెరలెత్తి
యెత్తిన తెరఁ దుత్తుమురుగాఁ జించుకొని పాటిసం బోనీక కారిసమరుటగు
వలచుట్టునుం జెట్టుదండ గొని నిలువ నలువుగల పుళిందులఁ గొందఱ నిలిపి
యమ్మందిపిఱుంద డాగిలంబులదోడ వాగురికుల నిలువ నియమించి తెరలకు లోనగు
వాని నందుఁ బడంగొట్టించియు గట్టు పెంటదట్టంబుగాఁ బ్రిజ నెక్కించి మఱి
కలయ గహనతలంబున నెల్లం జెల్లుగా విల్లు కేఁటుకు నేటుదప్పని మేటివిలుకాండ్రు
మృగములం వెలువడుటకు హరిచ్ఛదచ్ఛటావృతశిరః కటిధనుష్కాటులై కొట్టుకొనిం
జూపెట్టుకొని యెదురుమాటలు గాకుండనుండి సొదరి పౌరదారుపులం. బలవకుండ
నీరసుల సందుసందులం దమతమ కట్టిన మోటకత్తుల నొండొండ ఖండితంబులగు
మండగల కంపమండలు దోచి మునుముఖం గనుములొనరించుకొనం బంచి తాను
నొక్కొక్కరొడం బాదచారియు నొక్కొక్కరొడఁ దురగాధిరూఢుండునునై
యెల్లెడల మెలంగుచుం గూతలెగయఁ బణవ మృదంగ దుందుభి ప్రముఖతూర్యంబులు
గొట్టించియు గాహళులు వట్టించియు నగ్ని యంత్రంబులు మొట్టించియు రోదమిన్ను
మొట్టంజోపు వెట్టించిన. 37

చకితైణావళిధావమానవలిత పుచ్ఛ స్వల్ప గచ్ఛత్తర
క్షుక్ష మాద్రిగ్రహాయాలు భల్లుకము వక్షోభాగ నిక్షిప్త డిం
భక వల్గత్ ప్లవగీకదంబము ప్రహాదాంభః ప్రోత్థితక్రోడసా
యక మాభీలమ ఖద్వివిష్టపుటితం బర్యో నస్తనం బత్తటిన్, 38

క. నెలవెడలియు నెఱిసడలియుఁ, జలముడిగియు నిదుర సెడియు ◆ జంట లెడసియుం
కలహము లడఁగియు బలిచెం, బులి కిరి కరి మన్ను దున్న ◆ మొదలగు మెకముల్. 38

ఉ. అత్తఱి వేఁపికాండ్రు యము ◆ నాంబుతరంగ పరంపరాకృతిన్
మొత్తరమైన సూకరస ◆ ముత్కరముం గని మోటుకాండ్రు వి
ల్లెత్తకమున్న రాజమృగ ◆ మెక్కుడు నట్లుగ దీని మిత్తికిం
బుత్తెమటంచుఁ బట్టెడలు ◆ బోరన ద్రుయ్యు భయంకరార్భటిన్. 40

క. జాగిలములు మొఱసడములు, జాగఁగలసి చాపముక్త ◆ శరగతి నందా
జాగిలము లెదిరెఁ బందుల, క్రై గోధాదికము గాలి ◆ కడరె నిరతముల్. 41

సీ. ఎగుచు కూఁతలు మొత్తె ◆ లెత్తి బిట్టాలించి, గమికిఁ గన్నాకయి ◆ గాలియరయు
వడిఁ గుక్క లంటంగ ◆ వచ్చిన మొదటఁ ద్రిప్పి, ఘుర్ఘురించుచు బయల్ కొమ్ముఁజిమ్మి
దాఁ గసించినచోట ◆ దారునఁ జొరఁబాఱి, యొకటి రెంటిని దొబ్బ ◆ లురులఁ బడుచుఁ
బాలచేరులు వట్టి ◆ తూలింప బలిమి నీ, డ్చుకొని దొంకలఁ దూఱి ◆ చుట్లఁ బెట్టు
గీ. నీఁటె పోటులఁబడి ◆ పేర్చు లీఁచులాడఁ, బోయి పోలేక దగఁగొట్టి ◆ పొదలు సొచ్చి
బొడుపడయును జొరనిదు ◆ పీఁటఁ బెట్టి, చూపులనె యొప్పుఁ బ్రజనొక్క ◆ సూకరంబు.

క. అట్టియెడ నొకవరాహము, బిట్టడిచిన మెఱసెఁ గుక్క ◆ ప్రేవులు దంష్ట్రం
జుట్టుకొని రొంపిఁ గలఁపఁగ, నిట్టలముగఁ దగిలినట్టి ◆ దొంతులు వోలెన్. 42

మ. హరిణం బొక్కటి కుక్కతండముఁ బురిం ◆ దానీకముం దోఁచి యు
ర్వరఁగా లూఁదక దాఁట నేటలవికిన్ ◆ వాహంబు నశ్వంబునా
కిరసావల్లభుఁ డేపె భల్లమున నింగిం గాళ్ళు జోడించుచో
గొరిజల్ నాలుగుఁ ద్రెవ్వ సేన వొగడెం ◆ గోదండ పాండిత్యమున్. 43

క. బఱచు కొఁక కడిదిఁ బతిముకుఁ, జెఱమలకై యేయఁ జిప్ప ◆ చినుఁగఁగ నదియు
క్కఱఁ గాఁడి దూసి పాఱిన, నఱిముఱి జాపరుపు వాఱి ◆ యల్లటు పడియెన్. 44

మ. గవిలో బెబ్బులి డాఁగి గుర్గుర్లు మెఱయం ◆ గాఁ గాంచి రాజేసె నే
య వడిన్ బాణము వెంటనే నిగిడి పై ◆ కల్పెచి రా నేసె రం
దవ కాండంబుఁ దదస్త్రము గొనక ◆ డాయన్ వచ్చి కాత్క్ష్ణెయక
ప్రవిభిన్నంబయి నేలఁ గూలెఁ బవిధా ◆ రాభిన్న శైలాకృతిన్. 45

తే. క్రొవ్వి వడగొండ కయివడి ◆ గుసుకు నొక్క, యొంటిగాని మహీనాథుఁ డొడిఁగి యేయ
గొరక మే నుచ్చి ధరఁ గాఁడ ◆ శరము విసరె, తే దస్రు శ్వాన మనుచుఁ దెల్పెదు సనంగ.

తే. ఒక్కడదు గత్తి గొఱక చే ◆ యుచును డాఁచి, నట్టురిగి తెంకిఁ గని పీఁక ◆ బట్టుటయును
మృగయా లందఱుఁ జని వెవ్వ ◆ రించి నిశిత, కాండములఁ జెండి రొక పెద్ద ◆ కాఱుబోతు

ఉ. ఆ సమయంబునం జకిత ◆ మై యొక యెవ్వనిమీఁద బాఱ వాఁ
డేసిన యమ్ము వమ్మయి మ ◆ హిం బడ కొక్కటి కొండచాలి పీ
శాసులఁ జేయ మెచ్చి వసు ◆ ధాధిప ముఖ్యుఁడు మోట్ల నున్న బా
ణాసన భృత్పుళిందులకు ◆ నర్థి నొసంగె నభీప్సితార్థముల్. 48

క. వలఁబాటిన వానిని భటు, లలుఁగుల పాలాడి రథిపు ♦ లై పట్టిరి బె
బ్బులి మహిష మెలుఁగు కిటి దోఁ, డేలు పెందలగు వానిఁ గొన్ని ♦ టిని వేఁటకరుల్

తే. మున్ను జాగిలములఁ గూడి ♦ చన్నయట్టి, యడవిపసుక్కలు కుందేళ్ళ ♦ నుందురువుల
నుడుముల గ్రహింపఁ బుట్టల ♦ కడలఁ బొదల, గిరులసందులఁ బసివట్టి ♦ తిరుగుచోట

చ. బరవస మొప్ప గాలితడఁ ♦ బాటు మెయిం గవిఁ దూఱి యొక్క కు
ర్కురము దమంబులోఁ వెరఁజి ♦ కోఁబలచేఁ గబళించి పొట్ట పెం
జరనుడు మంచుఁ దెచ్చి కని ♦ చేవ దొలంగక దుర్గించివైచెఁ ద
ద్గురుబిరుద ప్రమాదముల ♦ కుం బతి మోదవిషాదశాలిగాన్. 52

క. ఒడ లుబ్బ నిక్కి ముందటి, యడుగులం ధర నూది చిందు ♦ నలజలమునకున్
జడియక కొక గబ్బిగండరీ కుక్కుడుఁ గడిమిం దివిచెఁ గుర్ంగి ♦ కొమ్ములయుడుముల్. 53

తే. కంపతొడు గీడ్చిన జ్లేఁదు ♦ గానఁ జన్న, దెరు వెఱుంగుచు నొక డేగి పరవుతోన
పడి యడఁగియుండఁగాఁ బట పటన ముండ్లు, నాలిఁ గదలుట గని పంట్ర కోలఁ బొడిచె.

వ. అత్తఱిం దత్తఱంబున పొంత్తంబయి చోపుడుఁగోలలు గొని కెలంకుల పొలంబులం
బులుఁగులం జోపుచు దేగవేటకాండ్రు వేఱుపడి వేటాడం దొడంగి రందు. 55

ఉ. లీలఁ బుళిందుఁ డొక్కఁడు గళిందసుతోర్మి సరోజినీదళాం
దోళితశోకరేఖఁ దన ♦ తోరపు నల్లని దీర్ఘబాహుపై
హాలహలంబ పోలె నిడి ♦ యత్తెమునం దల యెత్తి చూచు బల్
సాళువమున్ వడిం జను శ♦శంబు పయి న్విడిచెన్ మహోద్ధతిన్. 56

క. మొల దట్టి చెఱఁగుఁ జెక్కుచు, బలుదిట్ట కిరాతుఁ డొకడు ♦ పటువగు ముష్టిన్
నెలకట్టెఁ బట్టి వేఱొక, నెలకట్టెం గొట్టి వైచెఁ ♦ జెమరుం గాకిన్. 57

సీ. పెనుదవ్వు దగ దొట్టఁ ♦ జని రెట్ట వడఁ గొట్టె, నుడువేధి బెళగువ ♦ నొక్క యెఱుకు
ఱెక్క తాఁకున నుర్కి ♦ నిక్కి చొక్కులు నొక్క, సుఱికకట్లేటి ♦ నొక్కొకరణంబు
పొదఁదూఱు నొక మేటి ♦ పూరేటి వలికెఁ బోఁ, దోలి కైకొని నొక్క ♦ తోఁచిగాఁడు
తను నేలం దొర చిత్త♦మున మెచ్చఁ దీతువుఁ జని బట్టె బిట్టొక్క ♦ డాలెడ్గ

గీ. విజ్ఞవిజ్ఞానఁ దన్నంగ ♦ విడువ కలమిఁ, గఱకుటంఘ్రుల నితికించి ♦ గజ్జె గదల
గతికి నెటి నెటి శోలెమ్ము♦కయును విరుగ, వితిచె వడిఁ గైజు నొక పెద్ద వేసడంబు. 58

క. నింగికయి కుంచె యెత్తె, సంగో యవి యార్పఁ బతు ♦ సంహతి గాడ్పుల్
ఱెంగని మాఱ్రియఁ గుజాగ్రపుఁ, గొంగల నొక లగుడు డిగ్గి ♦ గొట్టె నిలఁబడన్. 59

వ. ఇట్లు ఖేటఖేలనంబున వివిధ మృగవిహగవధం బాచరించి చాలించి యంతలంచెలఁ
బంచతాపలితచమరసృమరకిరిహరిణరురుమహిషపృషదంశగోణీకాశశపిశితఖండంబు
లొండొండ యువ్వెత్తుగా నాకుఁబొత్తరలం గట్టియు గుదులుగట్టియు జిక్కంబుల
నించియుఁ గావడుల నుంచియు సవరించి దిగదిగన విసరి బగబగన మండు చిదుఁగు
సోదమంటల కడ్డంబుగట్టి మీసంబులం చూడిఁచూడి వాఁడులగు కత్తులం దితులొలిచి
కుత్తుకలం గోసి సితముఖంబులగు నఖంబులం బెకలించి విపులవపురసహాసిత మహా

శైలంబు లగు శార్దూలంబుల బొందుల నందందఁ బడవైచి యంతంత గాంతారంబున దంతురంబుగా బడిన దంతావళంబుల దంతంబులు గైకొనియుఁ దత్కుంభ నిర్గత మౌక్తికంబు లేఱికొనియు గోరజంబుం జమరవాలంబుల బర్హి బర్హంబులుం బరిగ్రహించియు మఱలి యుత్తలి గడింది నెత్తురుం బొర్ద్రగుటు వెలిచఱవం బరవ స్వేఁదము పెనుమాండ్లఁ బండ్లపరియలు నెఱియలు వారి బోరనం గారు ధారాళ రుధిరాసార పూరంబు నాకినాకి నాలుకలు దిగవైచి యేచిన మహాతపోష్మంబునం దృష్ణ వొడమి డగ నిగుడ వగ రడరి యొడలం దొడలను మెడలను బెడిదంపు నిడుద కోఱల సలుగు లడచిన యెడలం బొడబొడను వెడలెడు నుడుకు నెత్తుటం బడలి తూలం గౌలేయ కముఖ్యుల యంగముఖ్యు లాగ్రకర్పటంబుల గప్పి దప్పి నిగుడ నప్పాలంబు పశ్చిమపు దండ నుండు వెండికొండల జెండ కరకర హిండనంబునం బాండు ప్రభులు నిండి పఱచు తఱచు సెలయేఱుల నూరెలం గాయకొను భూరుహానికాయంబుల డాయంజని తద్ఘనచ్ఛాయల నిలచి యచ్చటం గ్రొచ్చి గరువుసెలల గుంట లొనరించి లోన నుమ్మగిలి గబ్బువలవక కమ్మతావులుగల నావురాసులు పఱచి రొఱచి లో మేలేటి కారిజముం గ్రిందవకాయ క్రొవ్వు మొదలగు మిగుల మెత్తని పలలభిత్తంబు లందుఁ గ్రందుకొనం గ్రుక్కి యొక్కువ తక్కువలు గాకుండ గండగల తింత్రిణీ శలాటుసంఘాతంబు లామీద నెఱయం బచరించి యొనరుగాఁ దేటలగు లేటి నల్లులు గ్రుమ్మరించి లవణకణపంచయంబు నించి లావుగాఁ గావుగప్పి యుపరి ప్రదే శంబులఁ గారెనుప వెంటపట్లనీ రాలు నేలుఁబిడుకల దాళ్ళిడి నెల్లి కొయ్యలు ద్రిచ్చి నుచ్చులంటించినం బెచ్చు పెరుఁగు చిచ్చులాత్రింపులం దవిలించి చిమిడ నుడికిన వెలువరించి యుష్మను వెప్ప గలయ ప్పితత్ఖండంబులుం గనగన నిప్పులం జిమురు చిప్పిలం గాలిచిన కమ్మకఱకుట్లుం జటాగ్రతిపయిఁ గాఁచేనికిం గుడుమువెట్టి పిదపఁ బాళ్ళ వెంబడిం బంచుకొని తారు నుపయోగించి తద్దేవతా ప్రీతికై దలలుఁ దోఁకలుం డొక్కలు నచటి విటవికిటపంబుల వేలంగట్టి శిశిరమధుర సలిలమ్ములుం ద్రావి వాగురికులు విశ్రమింప నిలింపాంగనాసుతుండును సహసమాగత చతురవలల కృతపలలఫలమూలాది శుచి మధుర మృగయోచితాహారంబులం దృప్తి వహించి పరిజనా రచిత పల్లవాస్తరణాసీనుండై గండూషిత పుండరీక మధు రసాసారంబులగు నిర్ఝరానిల కిశోరంబు లాలయ నలయికలు దీరియున్న సమయంబున. 60

మత్తకోకిల. నిండె గావిరి దిక్తటంబుల ♦ నింగిఁ గుండలిచందరు
బ్బ్రండలిం గనుగొంచు వ్రాసెను ♦ మూలకాకులమూఁకల
య్యండ నిల్చె యదల్చె నప్డు శివాళి యాళిలఁ బద్మగ
ర్భాండ ఖాండము ధూళిధూసర ♦ మయ్యె నుద్ధత వాత్యలన్. 61

క. ఆ క్రూరగాములఁ గనుఁగొని, శాకునికుం డొకఁడు లేచి ♦ సంభ్రమ మొదవన్
జ్యాకలిత శరాసనుఁడై, వీఁకను సైనికులఁ దిట్టి ♦ విభుతో ననియెన్. 62

క. తలమగ నెకములఁ బొటిగొను, మఱువున వచ్చితిమి దవ్వు ♦ మనపాల ఖిటకి
త్తలినగు నిమిత్తములు నృప, కాఱగా విడ మనకు బెడ్డ ♦ గొడవగు ననినన్. 63

మ. అతఁ డాస్ఫాలిత సజ్యకార్ముకుఁడు వ్యాహారోద్ధురుఁడుం బార్శ్వ సం
భృత తూణాహృత చండకాండుఁడు దిశా ♦ ప్రేంఖత్కటాక్షాంచల
ద్యుతిజాలుండును నై పుళింద భట సం♦దోహంబు తోడన్ మహో
ద్ధతి నుండన్ జయలాభ సూచక నిమి♦త్తంబుల్ మెయిం దోఁచినన్. 64

వ. ప్రాణరక్షాసంశయం బగు మహారణక్షోభం బొక్కటి గలుగు మీఁద నెట్టిలకుం మితివెట్టరాని జయమంగళంబు లగునని యంతరంగమున నిశ్చయించి యాఅడిలు సమయంబున. 65

క. ఆ విపినాంతరమున హా, హా వనిత ననాథ ♦ నబల నార్తని పన్నం
గావరె యీ పుణ్యము నం, బోవరె యని పలుకునాఁడు ♦ మొఱవినఁబడియెన్. 66

క. ఆ మొఱ వేమఱుఁ జెవి నిడి, భూమండలభర్త కరుణ ♦ బొడమఁగ నయ్యో
యే మానిని కెవ్వనిచే, నేమాయెనొ యనుచు నచటు ♦ నీక్షించుతరిన్. 67

శా. మట్టె ల్మ్రోయఁగ గబ్బిచన్నుగవ గం♦పం బంద శ్రోణీభరం
బట్టిట్టై కటిఁ జిమ్మఁ జీకఁటులు గాఁ ♦ నభ్రభ్రజం బోడి క
న్లిట్టం జూపులు చిమ్మ రేఁగి దివి కో♦లంబాళిఁ గల్పింపఁగా
మిట్టాడంగ నరుండు లేని యడవిన్ ♦ మీనాక్షి దీనాకృతిన్. 68

క. ఒక్కతె భయ శోకంబుల, వెక్కుచు మెయిఁగల విలాప ♦ విభ్రమలక్ష్మిల్
దక్కుటయుఁ జెక్క యొఱపై, నెక్కొన ధరణీశు నెదుట ♦ నిలచి వినీతిన్. 69

క. పలుచని వా తెఱ మెఱుఁగునఁ, బలు మెఱుఁగులు సందడింపఁ ♦ బాపట పై నం
జలిఁ జేర్చి జలజఁ జూపులఁ, బలుకుల బులకండ మొలకఁ ♦ బలికెం గలఁకన్. 70

శా. ఓ రాజన్య మహేంద్ర యో మణిగణ ♦ ప్రోత్తాసి వాతాశన
ప్రారబ్ధోత్కటచక్ర యో మఖర శా♦ర్ఙ్గ క్రూర భాహోర్గళా
యో రుక్మాచలకల్ప యో కవచిత ♦ వ్యూఢాంగ కావంగదే
యో రాహుత్త శిరోమణీ నిరవధి ♦ ప్రోద్యత్ప్రతాపారణీ. 71

క. అనినఁ దలంపున నింపిన, యనుకంప నిలింప చంప♦కామోద సుతుం
డనునయ మొప్పగ నోడకు, మరి నిజ వృత్తాంత మడుగ ♦ నది యిట్లనియెన్. 72

సీ. విసమానములు గాఁగ ♦ వసతోడఁ బెనపెట్టి, నెట్టెంబు గాఁ జేర్పుఁ ♦ జుట్టినాఁడు
ఖండి కండెన చాయ ♦ బైసిమాలిన మేన, మెదడు గంధపు రొంపి ♦ మెత్తినాఁడు
కునఖంపు డాచేత ♦ పునుక కప్పెర నిండ, ప్రాణికోటుల నల్లఁ ♦ బట్టినాఁడు
కొకిబిక వేసంపు ♦ గూని మూఁపుల మీఁద, మూఁడు పంగల యీఁటె ♦ మోపినాఁడు

గీ. నిట్టతాడనఁ బొడవుచే ♦ నిక్కినాఁడు, నిడుద కోఱల మిడిగుడ్ల ♦ నెగడినాఁడు
నరవరోత్తమ నేఁడు మా♦న్నాళ్లనుండి, యానుఱుగొన వెంటఁ దిరిగెడు ♦ నసురయొకఁడు

క. ఏరొంత ననదల మొఱ వ్యాలాయము వినవలయు 'దుర్బ♦లస్య బలం రా
జా' యన వినవే ధరణీ, నాయకులకు నార్తరక్ష♦ణంబులె క్రతువుల్. 74

క. మరుదశ్వ పుత్రి కిందీవరాక్షి గంధర్వరాజు ♦ వలనఁబొడమితిన్
నరవర వెలసితిఁ గళలం,దుర మించుటఁ జేసి భువి మనోరమ యనఁగన్. 75

శా. రారాపిల్ల భుజాంగదంబుల మణుల్ ♦ రాలంగ విద్యాధరుల్
గారా మొప్పగ నెత్తికొందు నను నంకస్థాయినిం జేయఁగా
వారి న్వీడ్కొని సింహపీఠికఁ జలత్వం బొందు మా తండ్రి మం
జీరం బించుక గల్లుమన్న నవి దాఁ ♦ జెప్పంగ నింకేటికిన్. 76

తే. దేవ పారర్షి పట్టి కళావతియును, నల్లమందార విద్యాధరాత్మజన్మ
యగు విభావసి యును నాకుఁ ♦ బ్రాణసఖులు, వారు నేనును నొకనాడు ♦ గారవమున

సీ. నెత్తమ్ము లేకుండ ♦ నెత్తమ్ములం దాడు, విద్యాధరీకోటి ♦ విటులతోడ
నెచటి గాడ్పులఁ బుట్టు ♦ విచికలామోదంబు, శబరకాంతలగుట్టు ♦ సల్లిబట్టు
నెన్నగేంద్రపుఁ జఱుల్ ,♦ మిన్నంది పెన్నంది, కోరాడు, దనగుబ్బ ♦ కొమ్మలొడ్డి
యొందుండు గురివెంద ♦ పందిళ్లపూదేనె, జడియుందు శిలలందు జాలువాఱు

గీ. నట్టి కలధౌత శిఖరిఁ బుష్పాపచయము, సేయు వేడుకఁ బొదరిండ్ల ♦ చాయలందుఁ
దిరుగుచుండి యొకానొక ♦ దెసఁ దృణంబు, దళముగా వాత మొలచిన బిలమునందు.

ఉ. ఊసరవెల్లి చందమున ♦ నొక్కెట బిఱ్ఱనరాలు దేఱగా
మీసలు గడ్డముం జడలు ♦ మే నుదరంబును వీపులున్ జరా
ధూసరమైన రోమతతితోఁ బెనఁగంబడి దూది రాశిగాఁ
జేసినరీతి నున్న యొక ♦ జీర్ణమునిం గని కౌతుకంబునన్. 78

ఆ. ఇతని వదనకుహర ♦ మెద్ది నేత్రద్వయం, బెద్ది కర్ణయుగళ ♦ మెద్ది యనుచు
బూచివోలె నున్న ♦ వాచంయముని మోము, బాల్యచాపలమున ♦ బట్టుటయును 80

క. ధ్యానస్తిమితుం డగున, మ్మౌని మదీయాంగుళీ విమర్శనములచే
మే నెఱిఁగి తొంటియును సం,ధానము చెడి కన్ను దెఱచి ♦ దారుణఫణితిన్. 81

ఉ. ఓసి దురాత్మురాల గృహ ♦ మొల్లక సర్వసుఖంబులున్ నిరా
యాసమునం దొఱంగి మిహిరాంశు మరుచ్ఛదనీర నీరస
గ్రాసము దేహధారకముగా గుహలం దపమాచరించు మ
మ్మీసరణిన్ స్పృశించి నగ ♦ నేమి ఫలం బొనఁగూడెఁ జెప్పుమా. 82

క. తిమిరంపు వయసు గుబ్బల, కొమరాలవు నీకు దగిన ♦ గోవాళ్ల మహిన్
నెమకి నగరాజె ముదిసిన, మము జెనఁకిన నేమి కలదు ♦ మద మేమిటికిన్. 83

క. ఘూఘురుకొను జరభరంబున, నను గుసుఱై యున్న మమ్ము ♦ నడకించితి వి
ట్లు మర మనఁ బట్టువడు మింక, యనుచు నీ వనుచుఁ బలికె ♦ నాగ్రహ మెసఁగన్

క. జననాథ యేమి చెప్పుదుఁ, గనలుచు నవ్వుగ్ర తపసి ♦ కటము లదరఁగాఁ
దనచేతి వాఁగబెత్తము, గొని పసరముఁ గొట్టినట్లు ♦ గొట్టె నదయుఁడై. 85

క. కొట్టువడి యటకు మును పే, తిట్టుంబడి యేడ్చు నాదు ♦ దెసఁ గని మదిలో
గట్టలుక వొడమి నా సఖు, లిట్టనిరి మునీంద్రుతోడ ♦ నెత్తిన పలుచన్ 86

ఉ. ఓయి దయావిహీన మతి ♦ యారక యీ పసిబిడ్డఁ గొట్టఁ గాఁ
జే యెటు లాడె నీకు నిది ♦ చేసిన దేమి వృథా శపింతురే
బోయవె యేఁడుఁ దోఁడు నను ♦ బుట్టువె శాపనిమిత్త మే తపం
బీయెడ నున్న శాంతిపరు ♦ లే మనువారిక నీ చరిత్రకున్. 87

క. పాము గడు మూదిసి కడపట, గామగు చందమున వార్ధ ♦ కంబునఁ గ్రోధం
బేమియు మానక మండెదు, నా ముని మునియే తలంప ♦ నదియుం దపమే? 88

క. పరుల యపరాధ గతులకు, గెరలక తనుఁ బొగడుచోటఁ ♦ గీడాడెడుచోఁ
బరితోషమ్ము రోషము నెడ, జొరనీని తపస్వి సుమ్ము ♦ సుకృతి ధరిత్రిన్. 89

తే. ఒండొకడవైన నిపుడు నీ ♦ పిండియుడమె, బ్రాహ్మణుఁడవౌట మాచేత ♦ బ్రతుకఁగంటి
తడవఁ బనిలేదు నిన్ను గౌ ♦ తమముని గోవ, ననుచు వాదించి విడిచిన ♦ నాగ్రహించి.

క. మాసలి శపియించె నపుడ, య్యాసితాబ్జేక్షణల రాజ ♦ యత్యుత్క్షోభం
బెసఁగఁగ నశియింప నగు న, ద్దెసఁ బాయుడు నుగుణిగామి ♦ తెల్లమియకదా? 91

క. ఆరుజ యప్పుడె యయ్యం, భోరుహలోచనల బొందె ♦ భూవర నన్నున్
వారత్రయమున నుండియు, దారుణగతి నొక్క యసుర ♦ తఱిమెడు వెంటన్. 92

సీ. ఇచ్చెద నీ కస్త్ర ♦ హృదయంబు ని వ్విద్య, నరనాథ మున్ను పి ♦ నాకపాణి
యగు రుద్రుఁ డిచ్చె స్వా ♦ యంభువ మనువున, కతఁ డిచ్చె మతి వసి ♦ ష్ఠాఖ్య మునికి
నతఁ డిచ్చెఁ గరుణఁ జి ♦ త్రాయుధుం డను పేరఁ, దనరు మదీయ మా ♦ తామహునకు
నతఁ డిచ్చెఁ బెండ్లి యా ♦ నపు డరణంబుగా, మా తండ్రి కతఁ డిచ్చె ♦ మమత నాకు
గీ. సకల రిపు నాశకము యశ ♦ స్కరము నైన, దీని నేవేగ నాచేఁ బ్ర ♦ తిగ్రహించి
యడఁపుమా దైత్యు వీరు వా ♦ రనఁగ వలవ, దనఘ సద్విద్య యెందున్న ♦ గొనఁగవలయు.

క. అనుటయు శుచియై నిలిచిన, జననాథునకుం బ్రయోగ ♦ సంహారంబుల్
వనిత రహస్యంబుగఁ జెప్పిన నాతఁడు నెఱిఁగె నంత ♦ భీషణ భంగిన్. 94

మహాస్రగ్ధర. గళగర్త క్రోడ నిర్య ♦ త్కహకహ నదో, ద్గాఢ హాసంబు భూభృ
ద్బిలముల్ మ్రోయింపఁ గాదం ♦ బిని గతిని బొగల్, పెంప మిన్నెల్ల మైగాఁ
జలితాస్య క్రూరదంత ♦ క్షతరద వసన, క్షారకీలాల వేల్ల
జ్జ్వలన జ్వాలాభ జిహ్వాం ♦ చలుఁ డగుచు గదన్, శూలముల్ ద్రిప్పుకొంచున్.

ఉ. దానవుఁ డద్ధరారమణుఁ ♦ దాకె నుదగ్ర పదాగ్ర ఘట్టన
గ్లానిస పాట్టమై యచటి ♦ కాన ఘరట్ట విఘట్టితాకృతిం
బూని చెడెం గిరీశగళ ♦ మూల హాలాహల కాల కాంతితో
మేనతికంబు లాడు తన ♦ మేఁటి త్రిశూలముఁ బూని యుద్ధతిన్. 96

తే. నింగి నొరయు రాకాసిమ ♦ న్నిని మేని, నీడఁ జీఁకటి గొనె నవ ♦ నీతలంబు
చంద్రికలఁ గాంచె నట్టహా ♦ సచ్ఛవులం, నిశిత దంష్ట్రలచే నవ ♦ నీతలంబు. 97

పంచచామరము. పలాసి డాసి రాజు పల్కె • నోరి ! నోరి నేటి కీ
పలానఁ బెన్ బలాన లేక • పోవ నీవు దోఁచి తా
బలా బలాలి తోఁడ బాలఁ • బట్టిబిట్టు చుట్టి నిన్
హళాహళిన్ హలాహలాభ • యా బుభుక్ష దీర్చెదన్. 98

మహాస్రగ్ధర. అని బాహాస్ఫోటరావా • హతపతగకులం, బవ్వనీ శాఖి శాఖా
జనిత వ్యాకీర్ణ జీర్ణ • చ్ఛదముల కరణిన్, జల్లనన్ రాల భూమా
ర్బిసు దీర్ఘాలాత చక్రా • కృతిగఁ జిఱ్ఱజిఱ్ఱం, ద్రిప్పి వైచెం గరన్ వై
చినఁ దేజిన్ రాజు గెంటెం • చె దొలఁగ నదియు, చ్చెంత శాంతార మేర్చన్.

పృథ్వి. గదా హతికి నాత్మ గొంక • క యెదిర్చి రాఁ నిదెఁ
గదా యనుచుఁ ద్రిప్పి రాక్ష • సుఁడు వైచె గాఢభ్రమీ
నద త్కనక కింకిణీ • వటన జాగ్రదుగ్రార్భటీ
వదావద మహా గుహా • వలభియైన శూలంబునన్. 100

శా. ఆ శూలం బవనీశమౌళి కులిశా • హంకార హుంకార కృ
న్నైశిత్యం బభినుత్యమై సెగదు బా • ణ శ్రేణి జెండాడి వే
కాశ శ్వేత గరుత్పరంపరల నా • కాశంబు దుగ్ధాబ్ధిసం
కాశంబై వెలుఁగన్ శరాసనులచేఁ • గప్పెం గకుప్పంక్తులన్. 101

క. అవియాతని పై తోలును, నవియింపగ లేక మిడిసి • యల్లటువటుఁ జూ
చి వనేచరు లేచిన వెఱ, దవిలినమతి నద్దిరయ్య • దయ్యం బనుచున్. 102

సీ. పక్కుపక్కున నంఘ్రి • పాశముల్ వెసఁ ద్రెంచి, డేగతండముల మిం • టికిని విడిచి
గళగళధ్వనులతోఁ • గంఠ శృంఖల లూడ్చి, సుడివడ గుక్కల • నడవి గలిపి
గుప్పగుప్పన మోచి • కొనియున్న వలలతోఁ, బలలంపు బొత్తరల్ • పాఱవైచి
కంగుకంగున నేల • గైదప్పగా బడు, చేటమ్ము లేరక • దాటిదాటి

గీ. తిరిగి చూచుచు దల్లైగ • దీసికొనుచు, దగలు దొట్టి యధాయధ • లగుచు విరిగి
యొకఁడు వోయినత్రోవ వే • ఱొకడు పోక, చెట్టొకడు గాఁగ బఱచిరి • చెంచు లపుడు.

క. ప్రోపుఁ దలపోసి నిలుపక, పాపాత్మకమై కిరాత • బల మటు పాఱన్
భూపతి య య్యంతి హయము, స్థాపితఁగా జేసి పలికె • ద న్ముఖ్యులకున్. 104

ఉ. కైదువు సున్న పూజ్యమౌ • కంకట ఖేట శిరస్త్రలత్రముల్
లే దరదంబు తత్తడి హు • ళిక్కి సహాయము సర్వమంగళం
బీ దను జొందు చిక్కు భయ • మేటికి లుబ్ధకులార యాత్మనుం
బేదతనంబు మాలె మతి • మృత్యువు డాఁగెడి చోటు లేదొకో. 105

ఆ. నీడఁ గడవఁ బాఱ • నేలకు వెలిగాఁగ, నడుగు వెట్టి తిరుగ • నాత్మ కొఱఁగి
రొకటి దలప నరుల • కొదవిన నొదవదే, కరణి మృత్యు దేవి • గన్నుఁ బ్రామ. 106

క. చావుఁ దలపోసి మానవుఁ, డేవగ దుష్కీర్తి వొరయ ♦ కే దివసములు పొం
దైవెడలు నట్లు నడవఁగ, దైవం బటమీఁద మేలు ♦ తాన ఘటించున్. 107

సీ. బుద్ధీంద్రియ క్షోభ ♦ ములకు బెట్టని కోట, విపదంబురాశి దు ♦ ర్వికృతికోడ
ఖలదురాలాప మా ♦ ర్గణ వజ్రకవచంబు, రణ మహీస్థలికి శ్రీ ♦ రామ రక్ష
శాత్రవ దుర్గర్వ ♦ సంస్తంభ నౌషధి, మొనయు చింతాశ్రేణి ♦ ముక విప్ప
యోగాది సంసిద్ధు ♦ లొనఁగూర్చు పెన్నిధి, తూలు నేకాకుల తోడునీడ

గీ. సకల సుగుణప్రధానంబు ♦ సకలకార్యజాల సాఫల్య కరణైక ♦ సాధనంబు
ధైర్యగుణ మట్టి ధైర్యంబు దక్కి పోరఁ, దత్తరింతురె యకట మీ తరమువారు. 108

క. అని తెలిపి తిరుగు డనుటయుఁ, మనమున లజ్జించి యెఱుకు ♦ మన్నీ లిఁక నీ
జనపతి తోడిద లోకం,బని తమతమ మొగలు ద్రిప్పి రవియును దిరిగెన్. 109

వ. ఇట్లు తిరిగి యక్కుక్కి రక్కసుం డెక్క డెక్కడ నని యక్కూట భూలంబు లగు
దంబులు గటారు లీఁటెలు బందీఁటెలు విండ్లు గండ్రగొడ్డండ్లు జిల్లకోలలుఁ బాట్రి
గోలలు మెరయ రయసముద్భూత ధూళి ధూసరిత ధారాధరపథం బగుచు నొక్కపరియ
చీమపరియనం గవిసె నందు. 110

మ. శరసంధానముతోన కొన్ని యడుగుల్ ♦ జో జవ్వనం బాతి యు
ద్ధరణిం గాల్కొని ద్రోణముల్ దివియు దో ♦ ర్దండంబులం జేఁది యే
సిరి బోటుల్ దను మంచు నార్చి పరఁగం ♦ జెట్టాసలన్ డాయుచున్
గొరువంకల్ మెఱవెట్టినట్లు గుణముల్ ♦ ఘోషింప రోషింపుచున్. 111

తే. ఆ శరావళి నమ్మను ♦ జాశనుండు, లీల మృగదంశకము మశ ♦ కాలి నొడిసి
చప్పరించు విధంబున ♦ శాతదీర్ఘ, దంష్ట్రికలఁ జప్పరించి రా ♦ వ్రమున గెరలి. 112

సీ. గళిత శృంఖలమైన ♦ గంధనాగమువోలె, బ్రజలపై బేరుముల్ ♦ పాటిపాటిఁ
కలశాబ్ధి మథియించు ♦ కైటభాంతకు లీలఁ, జవ మొప్పఁ జేతులు ♦ సాఁచిసాఁచి
కన లాను కీనాశ ♦ కాసరమ్మును బోలె, గమిచి తట్టున పంపుఁ ♦ జమరి చమరి
యమృతాపహరణార్థ ♦ మరుగు పక్షిస్వామి, గతిఁ బుళిందశ్రేణి గమిచి కమిచి

గీ. నెలవులు బిగించి నేరి దం ♦ ష్ట్రికలు మెరయ, నిడుప మొగమెత్తి మీసల ♦ నెత్తురోలుకఁ
బటపట కపాల పంక్తుల ♦ బగుల గొఱికి, బలము నెల్లను గడియలో ♦ పలన మ్రింగె.

క. ఆ సమయంబున గీర్వాణీసుతుఁ డయ్యింతి నొక్క ♦ నికటనికుంజా
వాసమ్మున నిడి క్రమ్మఱి, నే సురరిపుఁ దాఁకె దురగ ♦ వేగము మెఱయన్. 114

వ. ఇట్లు తలపడి యమ్మనుజ దనుజులు వీరంబులు ఘోరంబులుగాఁ బోరుతఱి భూరము
ఖుండు గ్రుద్ధుండై సమిద్ధరణి బద్ధపరంపర యగు నంపఱం బెంపఱం బంపరాదు నిలింపా
రాతి యని వితర్కించి కించిత్తును గొంచక కాంచనద్రవ కంచుకితంబును దరణిఖర
కిరణకాండ చండంబును నయి యాఖండల దోర్దండ సముజ్జృంభిత వజ్రాయుధచకచకం
బకపక నవ్వు వజ్రభేదియులుంగు వెలుంగు మత్తారులకు నుత్తంభిదు నత్తలంబును
బద్మరాగమణి చూడం బగు శిఖండంబునుం గొని వేడెంబునం దురంగంబు బఱపి తెఱపి
గని తఱటుచేసి యొరసి చన నుఱికించి కఱకుటురిబిరి పఱియపఱం బొడిచి కడచి
నిలిచినం బెలుచనం బరిగోలపోటున నాటోపించు మత్తకరివృత్తి నెత్తురోలుక

నక్తంచరుఁ డుదంచితగతి సవ్య దిశకొత్తి తలుపు నపసవ్యగతిఁ జాళింబున హయం బుఁ బోనిచ్చుచు నచ్చరకొదుకు దిరిగి తిరిగి సింగిణి సేయుచుఁ జుట్టుకొని రా మను జాతియు నట్లట్ల వెనుక వెనుక కడుగిడుచు సడ్డంబుగా నడవికడ క్రొత్తకొని నడచి యొడుదొడుకగుడు బెడిదంపునడక నడరి కడకాళ్ల కొడి కుంజిక్క రక్కసు నకుం దుష్కారంబను నాలోన నడిదంబునం బుడిమిపతి విడ విసరు విసరి యసురవరు కరాంగుళంబులు తెగ నడిచె నడచిన సుడివడక పడమలం దాటించిన ఘోరాట కంబు వెగ్గలంబుగ మొగ్గియు సగ్గలిక చెడక మోకరించుకొని కొన్ని యడుగులం చని సేకరించుకొని కంచుమించుగం బెలుచుట గగనచరుల వెఱఁగు వతిచెనట్లు పర చినం గందంబుఁ జెఱచి పెంగంబు దుడిచి పస్తుతులఁ గుస్తరించి యాతి రభసపూత్కార ఘోరారవంబుతో ఘోణారంధ్ర నిశ్వాస గంధవాహపవాహంబు వెడలం గాహంబు దగమట్టువడ నిట్టట్టు మట్టుంచుచు నా స్వారోచి నిశాచరు సూద్యోగంబు చూచి కొనవలసి నిలచి యంతన నలం డొక్క తెరువుగరయుగళి నితియుంబట్టి వెల్లగింపమల్లాడు నానోనన గల్లునం గింకిణులు మొరయ మెఱుంగు మెఱసినగతి నూరల హారిఁబఱపి యొకటి రెండు మూడు గొరకల నెఱయులు గాడ గుబ్బకొలందికిం దిగనైచి మాపిను విడిపించి యులయించుకొని బయలు వెడలించి దోషాచరుండు పాషాణమ్ముల కెప్పు డెపుడు వంగె నపుడెల్లం దురంగంబు నంటందోలి గంటి యిడి వెంటఁబడుటయు గెంటించి శేదుబంతి యన్న యట్లల్లంతనుండి వాగె సడలించి పగతునిపై నిగిడి వాగెఁ గుదియింప ముంగాళ్లు గగనంబునరా మగిడించి యందెచప్పుడుం గింకిణీ రవంబును నురుమ గీసినగతిం దేఁటి మోసిన క్రియ నాదారక యేదిక్కు జూచిన నా దిక్కున నే వినంబడె నెక్కడ జూచినం దానయై నీడ యేర్పడక పార్శ్వంబులం గట్టు కెంబట్టు లాలసరినమకట్టు లెక్కలుగా యాతుధానుం డను కొండబిలంబ నొడియ నేలపఱపుగా నాడు గరుడుండనం బాయుచు డాయుచు దవ్వులం బోలవి కుఱంగటఁ దోఁచి కుఱంగట నని చూడ దవ్వులం బోలవి దవ్వు చేరువల నిర్ధార్యం బుగా మెలంగం దేజశాశ్వంబు మెలఁపుచు వింటనుం బంట్రకోలల నడిదంబున నత్తలంబున నేసియు వేసియు నడచియుం బొడచియు గడపలం గానక మిడిపి మృతుం డునుంగాని దానవునిం జూచి వేసరి రోసంబున. 115

క. భూపతి పావక బాణం, బేపున సంధించి తివిచి ◆ యేసిన మెయిఁ గీ
లాపటలి పొదువ నతఁ డారూపం బెడఁబాసి ఖేచరులు వెఱగందన్. 116

లయవిభాతి. ధగధగని దేహరుచి ◆ నిగనిగని కుందనపుఁ
దగడు బెగడం జిగురు ◆ జిగి నెగుచు మోవిన్
నగవు నిగుడం గురుల ◆ పొగరు మగుడన్ నయన
యుగళి వెలితామరల ◆ మగల మగలై డా
తెగయ మృగనాభి ఘుఁ ◆ ఘుఁగ లేసఁగఁ జామరలు
మగువ లిడ వజ్రాళిమణి ◆ మిగులఁగ వెలుంగన్
తెగలుంగలు హారముల ◆ జిగి చెలఁగఁగాఁ గొదమ
తొంగలు దగు యానమున ◆ గగనచరుఁ డయ్యెన్. 117

క. నవనవ సౌరభముల నెన్నొందు కువలయావళి మాపుడు ♦ గురిసెన్ మొరసెన్
రవరవ మురజరవంబులు, దివి దివిజజలజముఖులు ♦ చెలఁగి నటించెన్. 118

వ. అనిన విని తరువాతి వృత్తాంతంబు వినుటకుం దివుటమై మదీయ మానసంబు కౌతుకా
ధీనం బయ్యెడు వినిపింపు మని యడుగుటయును. 119

శా. శ్లాఘాలంఘన జాంఘికోజ్జ్వల గుణాలంకార ఘీంకార హే
షాఘోషోద్భట ఘాటికా గజఘటాశ్వారోహ విశ్వంభరా
మోఘీభూత భుజంగ భోగధర సంఫుల్లాక్ష సత్రీక్షణా
దాక్షిణ్యా ప్రతిభా విచక్షణ త్రిలింగా ♦ ధర్మైక సంరక్షణా! 120

క. బహువీరహాసనమిళదఘు, సహసభ్రమకృత్కళంక ♦ వర్గోగ్రాసి
గ్రహిళ భుజయుగళ గజప్రత్యాహిప హారణతార్క్ష్యశ్రీ సజ్జనావన దక్షా. 121

పృథ్వీ. సుధీమధుర వాక్సుధా ♦ కుముఖ! నాగమాంబాసుతా!
మధుప్రవసాయక ♦ స్మయవిరామ రమ్యాకృతీ!
దధీచవిధుకామధుగ్ఘనదదుగ్ధ సింధుప్రథా!
వధీరణపరాయణోజ్జ్వల వదాన్యతాలంకృతా! 122

ఇది శ్రీమదాంధ్ర కవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్ష
పాదాంబుజాధీన మానసేందిందిర నందవర వంశోత్తంస
శఠగోపతాపస ప్రసాదాసాదిత చతుర్విధకవితామతల్లి
కాల్లసానిచొక్కయామాత్యపుత్ర పెద్దనార్య
ప్రణీతంబయిన స్వారోచిషమనుసంభవం
బను మహాప్రబంధమునందుఁ
చతుర్థాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ

# స్వారోచిష

# మనుచరిత్రము

## పంచమాశ్వాసము

శ్రీనందన సౌందర్య సు,
ధీ నందన వితరణావ ♦ ధీరిత బలిరా
డ్భానుజ పరరాజ్య స్వ,
ర్భాను భుజాహీంద్ర కృష్ణ♦రాయ నరేంద్రా. 1

వ. అవధరింపుము జైమిని మునీంద్ర చూడారత్నంబునకు నీడోద్భవంబు లిట్లనియె. 2

తే. అప్పుడు గంధర్వపతి మహి ♦ కవతరించి, రాజు విస్మయమున హాయ ♦ రాజు డిగ్గ
నక్కు సేర్చి మోదంబుతో ♦ ననియె దంత,కిరణములు హార కాంతుల ♦ సరసమాడ. 3

సీ. భద్రమా నీకు నీ ♦ బాహాభృత్క్షితిఁ, బ్రజలకు లెస్సలా ♦ రాచవారు
ధన్యుండనైతి నీ ♦ దర్శనంబున జేసి, నా దుష్కృతము లెల్ల ♦. నాశమొందె
నీ జగత్త్రయి నన్ను ♦ నిందీవరాక్షాఖ్య, గీర్తించు నప్సరో ♦ గీతసరణి
గారాపు మీ తల్లి ♦ కడుపాడి గాని నే, గణుతింప గడవాఁడఁ ♦ గాఁజుమీ త్వ్య

గీ. పెండ్లికొడుకవు మాకు నీ ♦ బిసరుహాక్షి. కూర్మినందన యొక్క మౌని ♦ ఘోర శాప
వికృతి మానిసిదిండినై ♦ యకట దీని, బ్రాణముల కల్గఁ దలచితి ♦ బాపబుద్ధి. 4

క. అను పెడ వచ్చి మనోరమ, జనకుని పాదముల కెరఁగ ♦ సస్నేహమతిం
గనుఁగవ నీరొలుకఁగ దం,దన మూర్ధఘ్రాణ మతఁడు ♦ దయగావించెన్. 5

ఆ. అపుడు విస్మితాత్ము♦డై వరూధిని సుతు, డేమి కారణమున ♦ నే తపస్వి
యిట్టి శాప మిచ్చె ♦ నెఱిగింపు విన వేడు,కయ్యె ననఘ యనిన ♦ నాతడనియె. 6

మ. కలడు ల్లోకయశఃపురంధ్రి జగతిన్ ♦ గంధర్వ వంశంబునన్
నల నాభాహ్వయుఁడేఁ దదీయ తనయుం♦డన్ బ్రహ్మ మిత్రుండు శి
ష్యులకుం గంటను వత్తిఁ బెట్టుకొని యా♦యుర్వేద మోరంత బ్రౌ
ఢులఁ జెప్పన్ వినుచుండి మానసమునం♦దుం దజ్జిఘృక్షారతిన్. 7

తే. మౌనివరుఁ జేరి భక్తి న♦మస్కరించి, చెప్పవే నాకు నీ విద్య ♦ శిష్యకోటి
తోడఁ గూడంగ నేఁ గృతా♦ర్థుండ నగుదు, ననుచు బ్రార్థింప నన్నుఁ జూచి ♦ యుపహసించి

క. నట విట గాయక గణికా, కుటిలవచశ్శీధురసము ♦ గ్రోలెదు చెవికిం
గటు వీ శాస్త్రము వలదిచ్చటు నినుఁ జదివింపకున్న ♦ జరగదె మాకున్. 9

తే. అనఁగ నేనట్టివాఁడఁ గా♦ననఘచరిత, యించుకించుక మీవంటి ♦ యెఱుక గలుగు
పెద్దవారల శిక్షల ♦ బెరిగినాఁడ, నవధరింపుము శిష్యుఁ గా ♦ ననిన నతఁడు. 10

క. ధన రాజ్య రమా మదమునఁ, గనుఁగానని నిన్ను శిష్యుఁ♦గాఁ గైకొనుకం
టెను నేరమి గలదే ననుఁ, గనలించుచు ప్రేల కిఁక బో♦కాలా మటన్నన్. 11

క. అచటన్ “ద్వేష్టి గతాయుశ్చ చికిత్సక”మను నరోక్తి ♦ చర్చను నుచ్చా
వచ వచనంబుల గోపము, ప్రచురమ్ము గానీక మాని ♦ పలికిట్లంటిన్. 12

తే. నీవు చదివింతువనుచు ని♦న్నియును విడచి, బిచ్చ మెత్తంగ రాదుగా ♦ వేలతపసి
కడవనాడకుఁ జాలు నీ ♦ గొడవ యేల, వెజ్జుఁ దనమేల యని మది ♦ లజ్జవొడమి. 13

శా. కంటే బ్రాహ్మణుఁ డెన్ని శాలు లఱచెన్ ♦ గర్వించి వీరెల్ల నా
కంటెం బాత్రులె విద్య కెట్లు నిది నే ♦ గైకొందు నంచు న్మదిన్
గెంటింపుం జల ముప్పతిల్ల గవటాం♦తేవాసినై శాంబరిన్
గొంటుం జందము మీఱ శిష్యుల గెడం ♦ గూర్చుండి చర్చారతిన్. 14

తే. కాయబాలగ్రహోర్ధ్వాంగ♦కములు నాల్గు, శల్య దంష్ట్రాజరావృష ♦ సంజ్ఞ నాల్గు
నైన యష్టాంగకమ్ము శావు ♦ లారగెల్గు, వైద్య మెనిమిది నెలలం స♦ర్వమ్ము నేర్చి. 15

క. ఇరు మూఁడు రుచుల దోషపు, విరసత మానన్ జ్వరాది ♦ వృష్ట్యాంతంబై
పరఁగు చికిత్సయుఁ గని శాంబరిఁ జూచి తపస్వితోడ ♦ మదమాన నంటిన్. 16

శా. తండ్రీ నాకు ననుగ్రహింప గదె వై♦ద్యం బంచుఁ బ్రార్థించినన్
గండ్రల్ గా నటులాడి ధిక్కృతులఁ బో♦కాల్మంటి వోహో మదిన్
దీండ్రల్ గల్గినవారి కే కరణి నే ♦ నిన్ విద్య రాకుండునే
గుండ్రా డాఁచినఁ బెండ్లి యేమిటికిఁ జ♦క్కుం గట్ట ముంటింపవా. 17

మ. అనినం గన్నులఁ జేవుఱింప నధరం ♦ బల్లాడ వేల్లత్స్వనః
పునరుద్యద్భ్రుకుటీ భుజంగయుగళీ ♦ ఫూత్కార ఘోరానిలం
బన నూర్పుల్ నిగుడన్ లలాట ఫలకం ♦ బందంద ఘర్మాంబువుల్
చిలుకంగం దుది దృష్టరూక్షనయన ♦ క్ష్వేళాకరాళ ధ్వనిన్. 18

వ. జటిలుండగు గిటకిటం బండ్లుకొరికి హుమ్మని కటమ్ము లదర మూఁకబుటమ్ములు నటింపఁ గటకటా కుటిలాత్మ యటమటమ్మున విద్యగొనుటయుం గాక గుటగుటలు గురువులతోఁ జూ యని కట్టకటంబడి కళపాలలోని బూది కేలంగొని యామురియగు మాయ మారయొడం బ్రయోగించి వంచించి యుపహసించితివి గావున ననుర్వై పిశితంబును వసయును నసృగ్రసంబు నశనంబులుగా మెసవి వసుధ వసియింపుమని బనుషంబు సల్ల గుండె ఝల్లుమని కల్లువడి మునితల్లడపడ పల్లవంబులం ద్రెళ్లి యిట్లంటి. 19

శా. నా యజ్ఞానము సైచి సంయమివరేణ్యా! కావవే రాక్షసుం
డైయే నెట్లు భజించువాఁడ దురితం బయ్యో నృమాంసంబు కూ
డైయే నెట్లు భరించువాఁడ నుదరం బుద్భ్రాంతరంగుండనై
రో యయ్యా! దయసేయవే యవధి యే నోపంగదే హింసకున్. 20

చ. అనినఁ బ్రసన్నుఁడై ముని కరాబ్జములన్ నను నెత్తి వత్స! మ
త్సునిశిత శాపశూలహతి స్రుక్కితిగా యిఁక గొన్నినాళ్లపైఁ
దనయను బ్రమింగఁబోయి యొక ధన్యుని దివ్యశరార్చిఁ బ్రేలి వే
కనియెదు భద్రమన్నఁ దురగంబు పయింబడి పొద్దు గ్రుంకఁగన్. 21

క. సన్నపు దలయేరున మయి, యున్నకొనుచు నామ దిన్న యట్లయి రాఁగా
ఖిన్నుఁడనై పురి కేగితి, దిన్నదనం బుడిగి కొన్ని దివియలు వెలుఁగన్. 22

క. అంప దగువారి గసరుచు, నంపి నగరు సొచ్చి వెలదు లారతు లీఁగా
నింపఱి గళాభిహతులం, జంపించితి వారి నన్నిశా మధ్యమునన్. 23

సీ. అభ్రమండలి మోచు నందాఁక నూఁక, పెరిగినట్లౌ మేను నరవరేణ్య
యవధి భూధరసాను వందాఁక నూరక, పఱచినట్లౌ మేను పార్థివేంద్ర
యబ్జభూభువనంబు నందాక నూరక, యెగసినట్లౌ మేను జగదధీశ
యహిలోకతల మంటు నందాక నూరక, పడిన యట్లవు మేను ప్రభువతంస

గీ. యఖిల జగములు మ్రింగువం తాఁకలియును,
నబ్ధి లేదును జెడఁ గ్రోలు నంత తృషయు
నచలచాలన చణమైన యదటు గలిగె
నసురభావంబు నను జెందు నవసరమున. 24

క. రక్కసుఁడనై నెపంబిడి, యొక్కొక యపరాధమునను నొక్కొక్కఁడుగా
బొక్కఁగ లోకము పురపురఁ, బొక్కఁగ బొడగన్యె నంతఃపురముం బురమున్. 25

తే. దారుపాడైనఁ గోళవుల యూళ్ల కుటికి, మెసవ దొరకొంటి బ్రిదమారి మసగినట్లు
తీఱెఁ గతిపయదినముల దేశమెల్ల, మల్లె వట్టిన చేరి క్రిమంబుగాఁగ. 26

వ. ఇవ్విధంబున విధివిధానంబున యాతుధానుండనై ధారాధరోత్సేధంబును నతి నిశిత రోమసంబాధంబును ధూమసమధామంబును గృతాంత్రదామంబును జలితకపాల కుండలంబును జ్వలిత సిత దంష్ట్రామండలంబును నాగాయత త్రాణంబును మస్తకోత్తుంగ ఘోణంబునునై యనవరత హింసానురూపం బగు రూపంబు దాల్చి శకటాంగ భంగికమ్ములై యింగలమ్ము లొలుకు నపాంగమ్ములం బిశంగమ్ములగుచు బశ్యజ్జనానుమోచనమ్ములగు లోచనమ్ములం వెలుంగ బభ్రుకేశమ్ములం దూల సకల భూత భయంకరమ్మగు పటిమ నిచ్చటి యుటజమ్ముల కుటికి జటియనక వటువనక యతి యనక వ్రతియనక గృహి యనక సతియనక శిశువనక భక్షించి భక్షించి కుక్షింభరత్వంబునం బ్రివర్తిల్లితి నది యట్లుండె వినుమా. తారలకు వర్షధారలకు నిసుములకుఁ గసవునకు లెక్కగలిగినం గలుగుగాని మదీయ జఠరానల జీర్ణజంతు సంతానంబునకు లెక్కయిడ నక్కమలగర్భుండును సమర్థుండుగాఁ డిట్టి కుత్రిమ దనుజ భావా

విష్ణుండనగు నాదౌష్ట్యంబు సవసవగాఁ దెలిసి మదురకయమున్న మత్కళత్రింబులం
బుట్టినింటి వారుత్సవాపలోక వ్యాజంబున ననిపించుకొని చని నిజగృహంబుల నునిచి
రక్షించుకొనియుండి రిపుడే నశనంబు గానక కానక కన్న యిక్కన్నియుం గైలాస
కాననంబునం గుసుమంబులం గోయుచానిం గని కనికరంబుడిగి కడుఁబుఁ జిచ్చు
నకుం బ్రమింగం దలుముకొనివచ్చి యిచ్చోట భవదీయ దర్శనంబున వృజినరుజ వలన
విముక్తుండ నై నిజ ప్రకృతిం బొంది కృతార్థుండ నైతి. 27

క. ఈ యుపకారమునకు బ్రతి, సేయఁగ శక్యంబె జంభ♦జిన్నిభ శఫరా
క్ష్యాయతలోచనయైన మ,దీయాత్మజ నీకు నిత్తు ♦ దేవీ మణిగన్. 28

క. ఆయుర్వేదముఁ గైకొని, యీ యింతిం బెండ్లియాడు ♦ మెలమి రమానా
రాయణ పరిణయ గేయవి, గాయన గంధర్వమైన ♦ కవ్వపుఁగొండన్. 29

లయ. అన్నగముపై జరత♦పన్నగపతిస్ఫుట లసన్ననగసి కోటతుద♦లన్న గడుకొమ్మల్
మిన్నగల రాయరుచిఁ ♦ జెన్నగు విమానముల, పన్నగడ వన్నగఁబ్ర♦భిన్నగజఘోట
చ్ఛన్నగహనాపణము ♦ లన్నిగనిగద్యుతి రవిన్నగు మణిప్రకర ♦ మున్నగరిమం బే
రెన్నఁగల యంగడుల ♦ వన్నెగని సంపదల, మన్నగరియొప్పు బల♦భిన్నగరిసేవన్.

తే. అని నిజోదంత మావంత ♦ యైన దాప, కంతయును జెప్ప నద్భుతం ♦ బంతరంగ
మంతయును నిండ హర్షించె ♦ నాస్వరోచి, యంతరవియోగఁ బశ్చిమా♦శాంతమునకు. 31

మ. వికసిల్లం బ్రజ చక్రి పాలనము గా♦వించెం గరవ్యాపృతిం
గఱుబంతంబుల నాక్రమించెఁ బొసఁగం♦గా నేర్చు వర్ణాళి గాం
తికిఁ బాపెం బెఱరాజకోటిఁ దుది కాం♦తిం బొందె దైవంబు నేఁ
తకుఁ దాపం బిఁక నే లనంగ నిను డ♦స్తప్రాప్తు డయ్యెం గడున్. 32

తే. అసురవరుడైన యిందీవ♦రాక్షు మేన, నంటుకొన్న స్వరోచి బా♦ణాగ్ని వోలె
నంతఁ గనుపట్టె శుకతుండ♦కాంతి దెగడి, సాంధ్యరాగంబు పశ్చిమా♦చలమునందు. 33

క. తలచూపె నప్పు డఖిలా, శల దట్టపుటిరులు చిలువ♦జవరాలు నభ
స్థలమండపకోపరిసీ, మల నిడిన సితాండపటలి ♦ మాడ్కిన్ జుక్కల్. 34

ఆ. సాంధ్యనటనచండ♦చండీశపదహతిఁ, ధరణిచక్ర మొరగి ♦ శరధిఁ గ్రుంగ
దోర గల్లువడియె ♦ భూరథేతరభాగ, చక్రమనగ నపుడు ♦ శశియు దోఁచె. 35

క. తమ మనుకొలాహి ప్రపం,చము నెరగొని యోగధీశ ♦ పద్యాకృతదం
డమున మగుడంగ గ్రొక్కుడు, క్రమమున నొయ్యొయ్య విడ్చి ♦ కడలకుఁ దొలగన్.

వ. అనంతరంబ క్రమక్రమంబున. 37

సీ. కలయ వెల్లువఁ గట్టి ♦ జలజల ప్రవహించు, శశికాంతవాఁత ని♦ర్ఝరము జలము
మలయానిలము చే దు♦మారంబు రేగు సౌ,గంధికంబు రజంబు ♦ కలువదుమ్ము
నిండార విరసిన ♦ బొండుమల్లెల నుండి, వడియు మరందంబు ♦ గుడరసంబు
తొలఁకి మింటికిఁ బొంగు ♦ దుగ్ధపాథోరాశి, కరడులమీది మీ♦గడల మెఱుఁగు
గీ. తనకు రసవర్గములు గా ♦ సుధాకరుండు, సారెసారెకుఁ గరములఁ ♦ సాచి సాచి
యచ్చ తెలుపుగ నపుడు బ్ర♦హ్మాండ మండ,పంబు వెన్నెల సున్న సు♦న్నంబు సేసె.

వ. ఆ సమయంబునం బరిశ్రాంతుండగు నమ్మహీకాంతుం డొక్క శశికాంత శిలామండపంబున దట్టంబుగా బఱచిన చిగురుపఱపుల గంధర్వరాజునుం దానును సుఖాసీనుండై యిష్టకథాగోష్ఠి నా రాత్రి గడపె నంత. 39

సీ. తనుబాపి శశి దవ్వు ♦ చనిన వెన్వెంటఁ బోలె, దొలిదిక్కు జవరాలు ♦ తెలుకఁబాఱె
ప్రథమాద్రి సభయందు ♦ బఱచిన కెంబట్టు, జముకాణ మనఁగ రా♦గము జనించె
ధవుఁ గూర్మి కొసరుచు♦న్నవి వోలె ముఖరాళి, వనరుహాస్యములఁ బ♦ద్మినులు తెఱచె
భానూష్మభీతి మాఱుపడిన చుక్కల భంగి, దొరఁగె వేకువగాలి ♦ దరుల మంచు
గీ. కాలకుణియుక్తి మింటి చక్కటికి నెగయ, వాసవునిపట్టి పాడవుగా ♦ వైచియాడు
గచ్చు చవరిన దారుచక్రింపు బిళ్ల, వోలె నొయ్యన బ్రాచిలేఁ ♦ బ్రొద్దు పొడిచె. 40

క. ఈగతి నత్తఱి దెలతెల, వేగిన గంధర్వపతికి ♦ వేగుట విని తా
రాగమన కేఁగి కాంచిరి, రాగమ్మున గొలిచి మను పు♦రాతన ఖచరుల్. 41

ఉ. కాంచిన బోంగి వారొసఁగు ♦ కానుక లర్థిఁ బరిగ్రహించి మ
న్నించి పురప్రయాణగతి ♦ నిక్క నరేంద్రుఁడు మున్న గాఁదటి
చ్చంచలవాహమై మణుల ♦ చాయల దిక్కు లలంకరించు హా
న్నంచు రథంబు చాఁగు బళి ♦ యంచు నకీబులం మ్రోయ నెక్కఁగన్. 42

క. నందనయుత సుచిత్ర రత్న, స్యందనమునఁ జనిరియు నర్థి♦జనకుని బడి న
య్యిందీవరాక్షు డీగతి, మందరమున కెగయ గగన♦మార్గము నందున్. 43

సీ. మండిగాలిడి దంత ♦ కుండాగ్రహతిఁ జించి, జలధరాంభము గరుల్ ♦ చల్లులాడ
సహిమాంశుహయ మేవ ♦ లాలించి చెవి వంచి, కెరలి వాజులు బయల్ ♦ గొరిజఁద్రవ్వ
ధ్వజవాతహతి నాఱ ♦ వైద్యుతాగ్నుల జాడి, పగలం దివిలయవారు పంజాలెత్త
బెటులు చప్పుడు లాత్మ ♦ భీరు స్వాంతుంగ్రహ, పరిరంభ సుఖము ఖేచరుల కొసఁగ
గీ. జామరప్రభ గగన గం♦గామరాళి, చకచక భ్రమ మొదవింప ♦ శంకరాద్రి
కాననము మోచి మందరా♦గంబు దాకఁ, బౌజు వెట్టిరి తన్మూల ♦ బలము దొరలు. 44

క. కుంజర శతాంగ హయ భట, రంజితమై పెరజి ప♦రంపర లలరఁగా
మంజులకాంతిఁగ సీసపు, మాంజిష్ఠముఁ బోలె గగన ♦ మండప మమరెన్. 45

తే. సారిపి నీరీతి దివిఁ దోడు ♦ సూపినట్టి, దొరలు గొలువంగ ఖచరేంద్రుఁ ♦ డరిగి యరిగి
మింట గ్రహరాజు తనసగ ♦ మింటవెలుఁగు, మంథగిరి గాంచి పలికె న ♦ మ్మనుజపతికి

సీ. జరఠకచ్ఛపరాజు ♦ చరణాంగ గృహమేధి, భోగివేష్టన రేఖ ♦ బొలుచు జాఱు
కులములో దరితీపు ♦ గలిగి మించిన మేటి, మైనాకు నొరసిన ♦ మానటీడు
తొలువేలుపుల వేలు♦పుల పనుల్ గొను జేను, కడలిరాయలలోతు♦గన్న గబ్బి
సురరాజునకు బాండు♦కరి జేర్చు మరకాఁడు, కల్పకంబుల పంట ♦ కమ్మతీడు
గీ. కంటె మథిత సుధాధౌత ♦ కటకజాత, చంపక వనప్రకంపనా ♦ కంపవిసర
దఖిర మాఖరవ మధుకర ♦ ముఖర శిఖర, నందరస మందిరంబగు ♦ మందరంబు. 47

శా. వైకుంఠాగత హేమమాతతవల ♦ ద్వ్యాకాశనా కృష్ణ రే
ఖా కారంబులఁ జొట్టునంటి మొలనూ♦లై మేటి యొడ్డాణమై
శ్రీకారప్రభఁ గంఠియై శిఖరి రా♦ట్సింహాగ్ర పత్పట్టమై
యీ కాండం గనుగొంటె మా యదిపుడున్ ♦ హేరాళవుం గాంతులన్. 48

తే. వేదవేదాంతముల వేధ ♦ వెదకి కనని, పద్మలోచను శ్రీపాద ♦ పంకరుహము
లబ్జ రేఖాంకితము లవే ♦ యచల వంశ, వల్లభుని మేఖలాసీమ ♦ నెల్ల మెఱయు. 49

ఉ. నాలుకబంతి వ్రేలఁబడి ♦ నంజునఁ దోఁగి తమాల పల్లవ
శ్రీల హసింప నుబ్బి కను ♦ గ్రేవల జేవురు పుక్కిలింపగా
వాలిక మేని పేఁ చెగడు ♦ వాడిన మూల్యము వోలె నాదిమ
వ్యాళము దీని పగ్గమయి ♦ నట్టి యవస్థ దలంతు నెప్పుడున్. 50

చ. బిలముఖపంక్తి నీ ధరణి ♦ భృత్పతివారిధి నిర్భరభ్రమిన్
దళముగ మున్ను ద్రావిన సు♦ధారస ధారగుణంబునం జామీ
కలిత విశాల దూర నిర♦పాయ సుఖస్థితిఁ గాంచె నాఁగఁ గో
మల విచలచ్ఛిరోరుహాత ♦ మాలవి నీలిమ రేఖ యొప్పెడిన్. 51

చ. జడధి మథింప జిక్కు సుధ ♦ సౌరభ మానుటఁ జావు దక్కు తా
పడకులనుండి దుగ్ధభవ ♦ పాండిమ బొందుల నందమొంద నిం
దడవి మెఱాలతోఁ గదుపు♦లై చరియించును మేఁతకై బయల్
వెడలి ధునీకుళీర శకు♦లీమకరీ ముఖవారి జంతువుల్. 52

మ. అనుచుం జందన పంకపంకిలితలం♦బై శేతురుద్ధాత పా
ధ్వని రుద్ధంబయి మంచకోపరి కుటీ♦వాటీ నటన్నర్తకీ
జనమై యావత సర్వతః కలిత కే♦తూ తోరణ స్రగ్విని బం
ధనమై యొప్పు పురంబు సొచ్చి భవన ♦ ద్వార ప్రఘాణంబునన్. 53

క. మంతుల బాంధవ భట సా♦మంతుల నాశ్రితుల నిలిపి ♦ మహీకాంతు నిశా
కాంతమణికాంతి కందళ, కాంతంబగు నొక్క దారి నగర విడియించెన్. 54

వ. విడియించి యనంతరంబ యంతఃపుర కాంతాకరాంతతంతన్యమానమణీ భాజన నీరాజన మంగళంబు లంగీకరించి ప్రియాంగనల సంభావించి మఱుఁద నాస్థాన మండపంబున కేతెంచి మతంగ మంకి మంకణ మందపాల మరీచి మాండవ్య మార్కండేయాది మహామునుల రావించి లగ్నంబు నిశ్చయించి గగన చర జంఘాలకర ప్రేషిత లేఖతరు లేఖా ముఖంబుల జిత్రరథ చిత్రాయుధ చిత్రసేనాదులగు గంధర్వులను వరాహకర్ణ గజకర్ణ సుకేతు మాణిభద్ర ప్రముఖ యక్షులను రేవంత ప్రముఖ గుహ్యకులను మందార ముఖ్య విద్యాధరులను బిలిపించి వినయపూర్వకంబుగా విత్తాధిపతికి విజ్ఞాపన పత్రిక లిఖించి నిజ ప్రధానులం బంచి నలకూబరు రావించె నంత. 55

క. పసుపుల నలుఁగిడి రైదువ, బిసరుహలోచనలు పెండ్లి ♦ పెద్దల యాజ్ఞన్
వసుధాధ్యక్షు బుభుక్షున, కసితాలకభరకుఁ బేర♦టాం డ్రొగిఁ బాడన్. 56

ఉ. మజ్జనమాడె రాజు కృశ♦మధ్యమ లింపున దంప గుంపులై
గొజ్జఁగి నీటివెల్లువలు ♦ గోవజవాజుల నిగ్గు జూపఁ జం
చజ్జరఠాహికంచుకము ♦ చాయ మడుంగుల నొత్తెఁ జెమ్మనీ
రుజ్జగిలన్ వహించె మెయి ♦ నూదిన బాఱుదుకూల చేలముల్. 57

చ. గరువున గొత్తచెంగలువ ♦ కచ్చు ఘటించిన మావి జొట్టె జెం
దిరిక చెఱంగునం బసిడి ♦ తీఁగెలు నించిన జిల్గు పాగ బం
ధుర సభ వాసనా పవన ♦ పూరణఁ దేల నలందెఁ గస్తురిన్
మరకత మౌక్తికాది మణి♦మండన మండితుఁ డయ్యె నయ్యెడన్. 58

మ. కదిసెన్ లగ్నమటంచు మంత్రులు దొరల్ ♦ గంధర్వరాజాజ్ఞ ను
న్మద వేదండఘటా భటాశ్వ రథ సే♦నా జైత్రవాదిత్ర సం
పద మీఱం జనుదెంచి కాంచి ముద మొ♦ప్పం జేసి రారూఢుఁ గాఁ
గదలెన్ కాంచన కక్ష్యలన్ మెఱయ లే♦ఖస్వామి చౌదంతిపైన్. 59

ఉ. అత్తఱిఁ బట్టణంబు విక♦చాంబురుహాక్షులు కౌతుకంబునం
జిత్తము లుల్లసిల్లఁ గయి♦సేసి గృహాంగణ సౌధమాలికల్
హత్తి నరేంద్రవీథిఁ జతు♦రంగబలంబులఁ గొల్వఁగా మరు
న్మత్తగజంబుపైఁ జను కు♦మార శిరోమణిఁ జూచి రుబ్బునన్. 60

ఉ. అంచలు గట్టి కాలితొడు ♦ సైచన నీవు గదమ్మ పోదిరా
యంచలి పేటి సంగడము ♦ లయ్యెను దయ్యెమ దోటి కేడ్కు నా
కంచు బదంబున న్మొరయు ♦ నందియ యూడఁగ దన్ని పోయి వీ
క్షించె లతాంగి యోర్తు ముర♦జిన్నిభు సాగరమేఖలావిభున్. 61

చ. వలపుల పల్లవుం డొకఁడు ♦ వట్టి చలంబున నేఁప దీనయై
యలుకలు తీర్చి తీర్చి యొక ♦ యచ్చర వచ్చి నృపాలు నన్నగ
ర్వెలువడి చూచెఁ గాముకుఁడు ♦ వెంటనె రా నపు డాత్తఘర్మయై
వెలవెలఁ బాఱెఁ దన్ముఖము ♦ వెల్వలఁబాఱె విటాననాబ్జముల్. 62

చ. చిలుకల కొల్కి కల్కి యొక ♦ చేడియ నాటకసాల మేడపై
నిలువున నాడుచుండి ధర♦ణీపతిఁ జూడఁ దలంచి యంచునన్
నిలిచి రహిం గనుంగొనుచు ♦ నెయ్యమునం దనువల్లి యుబ్బి కం
చెల తెగిపడ్డఁ గేలనమ ♦ చీఱ చెఱంగున మూసెఁ జన్నులన్. 63

ఉ. కీరమనోజ్ఞవాణి యొక ♦ కిన్నెర కిన్నెర మీటి మీటి యొ
య్యారపు లీల నేఁగి వసు♦ధాధిపుఁ గన్గొనె జిల్గు పయ్యెదన్
హారముఁ జక్కఁబెట్టెడు కు♦చాహిత హస్తము పైడి గోళ్లు హిం
సారతి సేయు దర్పకుని ♦ పంపెగ ములుకులఁ బోలె మించగన్. 64

చ. పరవశ దైన్యమూడుకొను ♦ ప్రౌఢలఁ గాన దుఘర్మవారిచేఁ
గరిఁగి స్రవించు చిత్రికము ♦ గాన దనాదృత నీటిపాటలా
ధరమున సున్న మంటిన వి♦ధంబును గానదు నవ్వుటాల కా
తరణము గొన్నఁ గాన దొక ♦ బాల నృపాలునిఁజూచి నివ్వెఱన్. 65

చ. అలికులవేణి యొక్కతె రహఃకాంతమునం దన యంగ వల్లికం
బులకలు చొక్కఁ జేఁజెమరుఁ ♦ బుట్టఁగ నేగి నరేంద్రుఁ జూడ సా
పులకలం జొక్కఁ జేఁజెమరుఁ ♦ బోవక యట్టుల యుండె నట్టిదోఁ
చెలువగు వానిఁ గన్గొనిన ♦ చెల్వల చూపుల గావె కూటముల్. 66

చ. అలరులబంతి జృంభికకు ♦ నడ్డము సేయుచుఁ గర్ణపాళిపైఁ
గలకలఁ ద్రోయుచుం దరఁగలౌ పతిహదాళులఁ గోట మీటుచుం
జెలిభుజపిరి నొత్తగిలి ♦ చిల్కను దువ్వుచు వాలుఁగన్నుఁ గ్రే
ఎల కుదఘార చేర నొక ♦ వారవిలాసిని చూచె రాముడున్. 67

చ. జిలుఁగులఁ బెట్టుచుం దొడలఁ ♦ జెంద్రిక పింపడె యంట మైతడిం
బెళపెళ లేని చీరఁ గటి ♦ బింకపుఁ జన్నులఁ జేర్చుకొంచు వే
జలకము లాడి యాడి యొక ♦ చాన కరస్థిత కేశయై నృపు
న్వలువడి చూచె లోపడితి ♦ నీ కని బాసకు నిల్చెనో యనన్. 68

మ. ఒక నేత్రాంబుజ మొక్కఁగల్ల మొకచ ♦ న్నొయ్యారపున్ లీల వీ
థికిఁ దోఁపన్ దలుపోరఁగా నొక పురంధ్రీరత్న మీక్షించె రా
జకిశోరంబు దదీయమై వెలయు భాషాలక్ష్ములం జూచి త్రిక్కం
బక భాగంబు వెలుంగి మైత్రికి శివా ♦ భాగంబ యేతెంచె నాఁ 69

మ. కలయం గూర్చుఁ జెమర్చు సంగమున లగ్నంబైన సన్నంపు మం
జుల కౌశేయమునందు మించు కమల ♦ స్తోమంబుచేఁ జూచె నొ
క్కలతాతన్వి చెలంగి పొంగుమది కాంక్షల్ దీఱ మేనెల్లఁ గ
న్నులుఁ గావించి కుమారు జవ్వనము చెన్నుం జూచు చందంబునన్. 70

వ. ఇత్తెఱంగునం గరంగు నంతరంగంబులుం గల వరాంగనల యపాంగంబులం దుఱంగ లించు సితేతరతరళతర దృగ్రోచులను భృంగశృంగార రసవీచుల చాలు సంబోలెఁ బొదువం బడి యాలంబిత చీనాంబర ప్రాంబు మాలికా చిత్రమ్ములగు నాతపత్రమ్ములు మెఱయఁ బత్రమ్ముల డిగ్గి దుర్గాధిపతు లేమేమ యని తొఱ్ఱు తొఱ్ఱిపాడుచు వీచు వీచో పుచ్ఛమ్ములగు కౌముదీ గుచ్ఛమ్ముల సంతరింప సంతిక వైజయంతికలం గ్రాలు వలు వలం బోలయు చిరుగరువలిం దూలు నీలాలకలయులకు లుభయ పార్శ్వ సముత్తుంగ మత్త మాతంగ మదసౌరభ సంగిభృంగ సంఘంబుల నెలయింప నింపారు కలపంబు లబ్బా టునం జేటు లెత్తి యొండొరుల యొత్తడిం జొడిపాడియై యొగయు విస్ఫురద్ వరాగ భాగంబు చదల నెల్లెడ నల్లెడగట్టిన టమర దట్టదట్టముగ సాగు నాగరుల వాగారవమ్ములు నిగుడ నెడపడక పొగడు పొగడికల కలకలమ్ములును పుంఖాను పుంఖ శంఖ భేరీ పటహ కాహళ వేణువీణాది వాదన ధ్వానంబును గల మధుర కిన్నరీ నిక్వాణంబుల రాణందారింపఁ జెలువు విన్నాణంబుఁ గొల్పు తెలుంగులను శిల్ప గాణలు పాడు లక్ష్మీనారాయణుల కల్యాణంపుఁ బాటలం దీటకొన్న తిన్నని రవం బులుం గలసి బలసికొను కోలాహలమ్ము లిమ్ముగ నందదుల నెడగలుగం జడియు

వేత్రహస్తుల ప్రశస్తతరసాహో నినాదంబు సంబంధించి పెంపొలయ నత్యంతకాంతంబయి నిరంతరగతిం గ్రంతనడప నడచివిచ్చులై మకుటారవింద రాగంబులం దెలుంగ నలుగడల సామంత సందోహంబు క్రందుకొన మందమంద గమనంబునం జను బృందారక వేదండంబుపై నుద్దండచ్ఛాయాకలాపంబు జంబేటి జంబాల కదంబకంబు దంబువిడంబింపఁ దిన్మని రవంబునం గలసి బలసిన కోలాహలంబు హంసాదివిహంగ హృదయంగమరావంబును బెడంబుడవ నడచు క్రొంత నత్యంత దర్శనీయంబులై మెరయు మంగళద్రవ్యంబుల నెడనెడఁ దీండ్రించు పుండ్రేక్షుదండంబుల కడలఁ గడలుకొను పసరుటాకుల డాలు శైవాలంబు సందంద క్రిందుగా మండుచేదివియలు చెందొవలునుంగాఁ జార్వ్యద్వయ సముత్తుంగ మణిసౌధవీధికారోదాంతరాళంబున గంధగజ ఘటా ఘనాఘన కాంతిక ధూళిమాగధ ప్రవాహంబునం గూలంకషంబగు నృపతి పథయమానాహ్రదంబు గగనగంగావగాహనాభ్యాసంబున నించుకొని పోవునదియునుంబోలె దనరదనసముద్దామ తేజోభరంబునకా జడిసిన మేరుగిరి మోరులుంబోలెఁ దీరుగల భుజంబులం దాలుమాలుగా నిడిన తారతారంపుఁ బంచసరంబులఁ దోరంతహారంబును గేయూరహీరంబులఁ గరకంకణ కురువింద కందళంబులఁ గటికనక మేఖలాఘటితం బగు చారు కరాచురీమరకతంపుఁ బిడి మెఱుంగులం దరిసి వెన్నెల క్రొన్ననురువులం బోరన నగుసరవడుగు జిలుఁగు కంచుకంబున మించి వెలుపలం దోఁప మంచుగవిసిన శోణ మహీధరంబునుం బోలె రాజభవనాంగణంబు చేరవచ్చె నంత నక్కడ. 71

క. కాంతాకదంబకిసలయ, కాంతకరావర్జ్యమాన • కనకఘటీని
ర్యాంత సుగంధి జలంబుల, నింతి జలకమాడి జిలుఁగు • లిడి తడి యొత్తెన్, 72

చ. తెలుకుడుమాలకాటఁ గటిఁ • దాల్చి పటీర మలంది హారకుం
డలమణి పారిహార్యరశ • నాకటకాంగుళి ముద్రికాది భూ
షలం దొడి పారిజాత విక • సత్ప్రసవావళిఁ బూని యొయ్యన
వ్వెలఁది వివాహవేది కలి • వేణులు దేఁ జనుదెంచె సిగ్గునన్. 73

తే. ఇట గృహద్వారసీమకు • నేఁగుదెంచు, నా కుమారున కిందీవ • రాక్షుఁ డెదురు
సని మరుత్కరిడిగ్గి పం • దన మొనర్చు, నతని దీవించి హిత మంత్రి • యుతముగాఁగ.

వ. భూసురాశీర్వాదనాదంబులు రోదసి నిండ నభ్యంతర గృహంబునకుం దోడ్కొని పోవునప్పు డప్పుడమితేఁ డెడనెడం బుణ్యాంగన లొసంగు నీరాజనోపచారమ్ములాదరించుచుఁ గక్ష్యాంతర ద్వారదేశంబుల మంగళార్థంబుగా నిడిన పూర్ణకలశ ముకురాది పదార్థంబులఁ గనుఁగొనుచుఁ దోరణస్తంభాయమాన రంభా తరుకిసలయోత్తాలతాళవృంతానిలంబులఁ గుంతలంబులు చలియింప మంధరగతిఁ గింపురుష వృషభుండగు గంధర్వరాజ పరిధానుం డొసంగు కైదండగొని యల్లనల్లన నడచి పురోహిత బ్రాహ్మణ బంధు పురంధ్రీ సందోహ నీరంధ్రంబయి వైవాహిక క్రియారంభసంభార సంభ్రమదభ్రంభాది మదుద్రంబోరువుల కలికి నునుసోగపలుకుల కలకలంబున గొలగొల మను కౌతుకాగారంబు సొత్తెంచి. 75

చ. ప్రభలు నభోవిటంకమున ♦ భాను మరీచులఁ బోదిసేయఁ గౌ
స్తుభనిభనూత్న రత్న పరి♦శోభితమై గరుడాశ్మ వేదిరు
గ్విభవము పొల్పగుంజ విక♦విద్రుమపాద సువర్ణపీఠిపైఁ
బ్రభుతఁ దలిర్ప మామ పను♦పన్ వసియించె నుదంచితస్థితిన్. 76

క. విధియుతముగ ఖచరుఁ డవన్యధినాథున కొసఁగె బసిడి ♦ హరివాణమునన్
మధురమఖభుగ్గవీదధి, మధురస సంపర్కమయిన ♦ మధుపర్కంబున్. 77

తే. అంచితాకృతి సాక్షాత్క♦రించినట్టి, రమకుఁ బ్రతివచ్చు సురమనో♦రమ మనోర
మ యనుదాని ననుంగు జా♦మాతఁ గైట, భారి సరిగాఁగ నర్చించి దారవోసె. 78

క. తదనంతరంబ హర్షము, పొదలు మదిన్ మెట్టుబ్రాల ♦ పుట్టికల రొండం
గదియం బట్టిన పెండెరఁ, గదియించిరి బంధుజనులు ♦ కన్యావరులన్. 79

ఉ. అప్పుడు తూర్యముల్ మొరయ ♦ న మ్మిథునమ్ము విలోకన స్పృహం
జెప్పలఁ దేల వంపఁబడు ♦ తెల్లని చీరతెరం గ్రమంబునం
గొప్ప మొగంబు నెత్తుఁ జను ♦ గొండలుఁ దోపఁ లతాంగి పోలెఁ జె
ల్వొప్పతిలన్ సుధారసప♦యోనిధి పెండెరఁ బుట్టు నిందిరన్. 80

చ. కటకరవంబు బోరు కలఁ♦గన్ రమణుల్ తెఱచీర వంచినన్
దటుకున రాజు మోమెదుట ♦ దారస మైన లతాంగి నేత్రముల్
చటులత లజ్జఁ దల్లడిలె ♦ జాలరి చేవలఁ బాసి ధాత్రిపై
నటు నిటు మిట్టి మిట్టుపడు ♦ నంబుచరంబులుఁ బోలె నత్తరిన్. 81

మ. అవనీశద్రిదళేంద్రు జూపు బరి క♦న్యాగండపాళిద్వయీ
నవలావణ్యరసంబుఁ గొల్లగొని యం♦తం జెంత ఫాలంపు రా
జా విలోకించి చలించి కైకొనిన యా ♦ సొమ్మెల్ల ఘర్మాంబుకై
తవ మొప్పన్ వెసడించి తూలెఁ గబరీ♦తాపింఛకుంజాంతముల్. 82

ఆ. రాజు చూడ్కి కవుడు ♦ రాజీవముఖి చూడ్కి, లెదురుకొనిరొ లజ్జఁ ♦ గొదికి గొదికి
జడిసి జడిసి జహ్ను ♦ సంభవాంభోవేణి, కదురు లెక్కుమీల ♦ కొదమ లనగ. 83

మ. తనుమధ్య త్రివళుల్ నటింప నిలమీఁ♦దన్ మట్టియ ల్మ్రోయఁగాఁ
గనుపాపల్ వయి ఱెప్పలం గదియ ను♦త్కంఠాగ్రియై నిక్క నా
థుని మాలిం దలఁబ్రాలు వోసె నవలా ♦ దోర్మూలకూలంకష
స్తనవిస్ఫూర్తికి సందిదండలఘళల్ ♦ సాహానినాదం బిడన్. 84

చ. మడిచెడు కంకణ ప్రభల ♦ ముత్తెపు సేసలు దోయిలించి యొ
త్తెడు తతి బాహుమూలకుచ ♦ దీప్తులపైఁ బతి దృష్టి పర్వినం
బొడమిన లజ్జఁ బాణియుగ♦మున్ వెన వంచియు మాళిమీఁదికై
పొడవున జల్లె లేనగవు ♦ పొల్తుక ఱెప్పల నప్పళించుచున్. 85

క. సకలక్ష్మాపతి యిడఁ గొ, మ్మకచంబుల నుండి రాలె ♦ మౌక్తికములు సా
త్త్వికజనిత గండఘర్మాం, బుకదంబా సారగరిమఁ ♦ బునరుక్తములై. 86

క. పతి సతిపై నిడు ముక్తా, వితతి పదం దొడఁగె వడి భ♦విష్యత్పురుషా
యిత నిర్దయరతిరభస, చ్యుతసితకబరీప్రసూన ♦ సూచక మగుచున్. 87

శా. కట్టెన్ మంగళసూత్రమున్ శరధిశ♦య్యాశ్రీలకున్ బొమ్మలం
గట్టం జాలెడు కంఠపీఠి నిఖిల♦క్ష్మాభర్త శోణద్యుతుల్
చట్టం బై నఖకోరకోత్కరము త♦ద్గ్రైవేయ హైమస్ఫుర
త్పట్టస్థాపిత పద్మరాగముల పం♦క్తింబుల్ విడంబింపఁగాన్. 88

క. ఆట్టియెడఁ బెండ్లి పనులన్, దిట్టలగు పురంధ్రు లచట ♦ నిలిపిరి వహ్నిం
బెట్టిరి మణిపీఠి కుశ,పట్టము పైఁ బఱచి రందుఁ ♦ బతియున్ సతియున్. 89

క. ఆశుద్విజహుత హారితశ, మీశాఖాశకల నినద♦మేదురవిశదా
భీశుజ్వాలాజాల మ, హాశాశ క్రోడమున వెలిఁగె ♦ రాహుతు లెలమిన్. 90

తే. తోయజామోదలాజలం ♦ దోయిలించి, ప్రమదమున వేల్వ నొక కొన్ని ♦ చెమటనంటు
వ్రేళ్లఁ గనుపట్టెఁ గెంజాయ ♦ వీతిహోత్రు, నాలుకలు సాటి రాకున్న ♦ నవ్వెననఁగ.

తే. ప్రస్తనగుచ్ఛ వధూదేహ ♦ దాడిమీల,తాపతల్లకపై హోమ ♦ ధూమ మడరె
భర్త నభిమతరతిమహో ♦ ఫలవిపాక, మగుటఁ గోరి ఘటించు దో♦హద మనంగ. 92

మ. జగతీనాథపతంగ మానతశిర ♦ స్సమ్మేళనన్ నెయ్యపుం
జగడంబుల్ ప్రియ మొప్ప మాన్పెడు లతాం ♦ చంచత్కిరీటాగ్రర
త్నగణస్పర్శసహంబు గావలసి యో ♦ నా కోర్కి దైవాఱ న
మ్మగువం బాదతలంబు పట్టి సనెకల్ ♦ మట్టించె మోదంబునన్. 93

క. కడు నవ్వించుచుఁ జెలఁగులు, మడి వెట్టన్ జేరఁటాండ్రు ♦ మదిత కనుబొమల్
ముడివెట్టె నాలి సిగ్గున, ముడివెట్టెన్ నారి చెఱఁగు ♦ మోసున మఱదుల్. 94

సీ. పరిణయించిరి ధరా♦మర పురంధ్రీహస్త, ఘటిత చేలాంచల ♦ గ్రంథికలనఁ
బరిపూర్ణ నిష్ఠఁ గొ♦ల్చిరి ప్రదక్షిణపూర్వ, వినతి నాలుకలార్చు ♦ వేఁడివేల్పు
వీక్షించి రుడువీధి ♦ నక్షీణసుస్థితి, స్థాయిఁ దోషిత రమా♦ధవుని ధ్రువునిఁ
బరిణయప్రాప్త స♦ప్తర్షి ప్రియాపేక్ష్య, సాక్షా దరుంధతీ ♦ పతి కెరఁగిరి
గీ. సకల సంయమిగణ నమ♦స్కరణ కృత్య, మాచరించి తదీయ హ♦స్తాభిమంత్రి
తాక్షతలు మౌళిఁ దాల్చి ర♦క్త్యాదరమున, దంపతులు బంధుకోటి కు♦త్సవ మెలర్ప.

ఉ. కూరిమి మంత్రి తోడ నల♦కూబరుఁ డేకత మాడి పెద్ద బం
గారపుఁ గోరఁ గల్పవని♦కాజని కాంతము లైన చీరలన్
హార విభూషణావళియు ♦ న మ్మిథునంబున కుం బ్రియంబుతో
సారదమాని చేత నద♦నం జదివించెఁ గుబేరు పేరుగాన్. 96

క. కలిమి మెఱయంగ మఱియుం, గలబాంధవు లొసఁగి రపుడు కాంచనమణిభూ
షలఁ జీరల నరపతికిం, బొలఁతికి నుడుగరలు ముదము పొదలఁగ నంతన్. 97

సీ. పొగడపూవంటి కంప్రుల మదాంబువులును, మధువర్ణదంత శుంభములు మెఱయ
శీకరస్వరచారు బృంహితంబులు ఘనాం,గారక గ్రహకాంతి కన్నులమర
నిలఁ జొట్టువడు తొండములు మించు పూర్వాంగ, మెత్తరంబై పిఱుం దత్తమిల్లఁ
గటము లుత్కటములై నిటలముల్ బటువులై, పిబ్బెంపు మొగములు నుబ్బిమీఱ

గీ. స్వర్ణకక్ష్యాంకుశప్రాస శరధిశార్ఙ్గ, ఖేటకుథఘంటికాద్య లంకృతులఁ జెలువ
మెసఁగు గంభీర వేదిభద్రేభశతము, నల్లునకు నిచ్చె గంధర్వవల్లభుండు. 98

శా. ఉర్వీజానికి మామ యిచ్చె శిఖిపింఛోద్భాసి వర్ణంబుచే
నర్వాచీనఘనాళి రోహితసహస్రాక్షీర్ణగా మింటఁ బూ
పార్వ్యసోమమఁ జిత్రయానముల నాటాడించు గాంధర్వ గం
ధర్వవ్యూహము దీప్తచండమణికాండస్వర్ణ సన్నాహముల్. 99

క. తళతళని తరణి మెఱుఁగులఁ, దలతల మను మణుల మెఱసి తలఁచినచోటన్
నిలుచు విమానము ఖేచర, కులతిలకుఁడు కూర్మి పెండ్లికొడుకున కొసఁగెన్. 100

వ. మఱియు రజత మహారజత శయ్యాసన భాజన డోలాకలాచికాఘటికటాహ పీటికాపేటికాది గృహోపకరణంబులును, మరకత కురువింద పురుమరత్న పురందర మణి మౌక్తికాది మహారత్న ఘటిత కటకతులాకోటి కంఠికాంగదహారావళీ కాంచికోర్మికాది కలాపకలాపంబులును, విచిత్రనేత్ర పేశలకౌశేయ చీనాంశుక ధట్టంబులం బెట్టినట్టి పెట్టెలును, అమూల్యాగరు మృగమద సంకుమద కుంకుమ పటీర కర్పూర హిమాంబుపూరంబులం దట్టుపునుంగు నగరు సత్తును మంచిగందవొడి చాఁదుదయ భాస్కరంబు లోనుగాఁగల పరిమళద్రవ్యసంభార పరంపరలును, జవ్వనంపుఁ గ్రొవ్వున నివ్వటిల్లి మవ్వంపువాతెఱలు విప్పనవ్వు నునుసోఁగ వెన్నెలలం గలసి పిసాళించు చంచల దృగంచల ప్రభలం బచారించి మెఱుంగు జన్నులఁ గన్నెతమ్మి మొగ్గలవన్నె నటమటించి పెన్నెఱుల మెఱుంగుఁ దుమ్మెదవన్నెఁ దటమటించి వెన్నడుముల విన్నుఁ వెన్నుదన్ని బటువు మిగిలి విటనికాయంబు రాయడింబడి పుటపుటనైన కూలంకష చాటువుల మాటకారితనంబు మెఱసి నాగరికపుఁ బనుల గరగరికల గళరవచ్ఛలాలాపాచరణంబుల రవణంబుల మిసమిసలఁ బసగలిగి మేలిమైన కుఱుకు రసికజనంబుల మనంబుల మరులు కొలుపం జాలి సురుచిరాభరణ భూషితంబగు పరిచారికా సహస్రంబును గూతునకు నరణంబుగా నిచ్చి మఱియును. 101

సీ. అవనతాంగుష్ఠాగ్ర◆హార్య నిర్యద్రత్న, ఖనిఘనాంతరిత శృం◆గాటకములు
మదముదావహ దివ్య ◆ మైరేయ ధారేయ, గోత్రభిత్స్విటపి నిష్కుటయుతములు
మహిళాకదంబ డిం◆భగాత్రహ్య గృహాచర, న్మృగనాభి సౌరభ్య నిర్భరములు
ప్రఖరాఖునఖరఘా◆రావిదీర్ణోద్దీర్ణ, సౌవర్ణ మృత్కృష్ట ◆ జాంగలములు

గీ. కోకకలహంసముఖరితా◆బ్జాకరములు, సిద్ధ చారణ గంధర్వ ◆ సేవితములు
మందరద్రోణిఁ గొన్ని గ్రా◆మములు కూర్మి, తనయ పనుపున కొసఁగె గం◆ధర్వవిభుడు.

తే. పౌర యాత్రిక సుర సిద్ధ ◆ చారణాహి, యక్ష గంధర్వ సాధ్య వి◆ద్యాధరులను
నిజపురంబుల కనిచె నిం◆దీవరాక్షుఁ, డుడుగర లొసంగి విభవంబు ◆ గడలుకొనఁగ.

వ. అనిన విని జైమిని మునీంద్రుండు మీఁదటి వృత్తాంతం బానతీయవలయునని యడుగుటయును. 104

మ. అతులక్షాంతిగభీర ధీరహిత చి◆త్తాంభోజ భోజక్షమా
పతి విద్యాపరిపాక పాకరిపుసం◆పద్భోగ భోగాశప
త్రితరస్ఫూర్త్యనుభావ భావభరిత ◆ శ్రీకాంత కాంతారపా
తిత కాళింగ కులేశ శేశతర వృ◆త్తిక్షీణ వైరివ్రజా. 105

క. నాగాంబానుత జితకద్రు,నాగత మదనాగసంగ ◆ మానూపగ్రహా
భోగా భోగ పురందర, భోగీంద్రశయాన పురుష ◆ పూజా ప్రవణా. 106

మాలిని. సరభసజయధాటీ ◆ చండవేదండకోటీ
కరవమథుహిమానీ ◆ కంపితాశావధూటీ
పరమహితమహాసంతీ ◆ భావభాగ్భూరితేజః
పరుమదహనకీలా ◆ ప్రస్ఫురచ్చక్రవాళా. 107

ఇది శ్రీమదాంధ్ర కవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్ష
పాదాంబుజాధీన మానసేందిందిర నందవర వంశోత్తంస
శఠగోపతాపస ప్రసాదాసాదిత చతుర్విధకవితామతల్లి
కాల్లసాని చొక్కయామాత్య పుత్ర పెద్దనార్య
ప్రణీతంబయిన స్వారోచిషమనుసంభవం
బను మహాప్రబంధమునందుఁ
బంచమాశ్వాసము
సంపూర్ణము.

---

శ్రీ

# స్వారోచిష

# మనుచరిత్రము

## షష్ఠాశ్వాసము

శ్రీకృష్ణరాయ మనుజేం,
ద్రాకాంతా పంచబాణ ♦ నరసింహ ధరి
త్రీకాంత గర్భవార్నిధి
రాకాహిమధామ కర్ప ♦ రదళ విరామా, 1

వ. అవధరింపుము శకుంతంబు లబ్బాదరాయణాంతేవాసి కిట్లనియె నంతనొక్కనాఁడు. 2

సీ. పాండురప్రభఁ గ్రిందు ♦ పడిన చీఁకటిపోలెఁ, జిగి నొప్పు నీలంపు ♦ జగతి మెఱసి
యౌన్నత్యమున మింగి ♦ నట్టి నింగుల గ్రుక్కఁ, గరణి ధూపము గవా ♦ క్షముల వెడల
ధారుణీసతి సుగం ♦ ధ ద్రవ్యములు దాఁచు, నరల పేటికవోలెఁ ♦ బరిమళముల
నెలవులై చెలువారు ♦ నిలువుల విలసిల్లి, కొణిగఁ బారావత ♦ కులము వదర

గీ. బసిడిసీట లిఖించిన ♦ ప్రతిమ లమర, నీఁగ వాలిన నందంద ♦ రొులుంగులొసఁగు
నట్టి సరినల మంచము ♦ లాదిగాఁగ, మొఱయు పరికరముల నొప్పు ♦ మేడమీఁద. 3

క. రమణునికడ కనుప మనో,రమకున్ మజ్జనము దీర్చి ♦ రవరవకచ పిం
ఛమునకుఁ గాలాగురు ధూ,పము వెట్టి జవాది నంటు ♦ వాపి నిపుణతన్. 4

సీ. చెంగల్వపూదండ ♦ సేర్చి పెందురముపై, ఘనసారమున నూస ♦ కము ఘటించి
పన్నీటితోఁ గదం ♦ బము చేసి మృగనాభిఁ, బూసి కుంకుమ సేస ♦ బొట్టుతీర్చి
విశదముక్తాదామ ♦ రశనఁ జిందురవావి, వలిపపు వలువపై ♦ నలవరించి
యుఱుత వెన్నెల గాయు ♦ హార మొక్కటి పెట్టి, మణులసొమ్ములు మేన ♦ మట్టుపఱిచి

గీ. కన్నుఁగవ గల్వ డాలుఁ ♦ గట్టెసఁగఁగ, ఘల్లుఘల్లునఁ బొండెంబు ♦ గండుమీలు
గదల నల్లన నడపించి ♦ పాదివితెచ్చె, నెచ్చెలులపిండు యువతి నా ♦ నృపతికడకు. 5

క. తెచ్చుటయుఁ గేళిభవనముఁ, జొచ్చెనొ చొరదో యనంగ ♦ సుదతులసీతం
జొచ్చిపయిఁ గొప్పు దోఁపఁగ, నచ్చేడియ తలుపుదండ ♦ నల్లన నిలిచెన్. 6

క. తదనంతరంబ బోటులు, చదురుల నగవులను బొద్దు ♦ జరిగినఁ గేళీ
సదనము నొక్కొక పనిచెప, మొదవఁగ వెడలంటయుఁ జిత్త ♦ మువ్విళ్ళూరన్. 7

సీ. దట్టంబు నీకట్టి♦నట్టి చెంగావికిఁ, బాగు గాదని కేలఁ ♦ బయట నిమిరి
గోరంటా గోళ్ల ని♦క్కువపుఁ గెంపోయని, చెయిపట్టి నఖమున ♦ సెజ్జ సేర్చి
నగరు ధూపముచేత ♦ నయ్యో తనూవల్లి, సెగ సోఁకె నని యెదఁ ♦ జెయ్యివెట్టి
మృగనాభి కామక ♦ రికలఁ గ్రమ మించె, నని మూరుకొనుచుఁ జుం♦బిన మొనర్చి

గీ. హారమణు లిటు సూపు నా ♦ యఱుతనున్న,
హార మణులకుఁ గాంతి నీ ♦ డౌనొ కావొ
యనుచు నక్కునఁ గదియించు ♦ నానెపమునఁ
గంపమును బొందు సతిమేను ♦ గౌఁగిలించె. ౮

వ. అట్లు కవియం దమకించి త్రిస్తరులఁ గుస్తరింప నింపు గలిగియు మానుమాన్న మానం బునం బొడమియుండెను నడలప్పుడు తలంపున బాటిన నమర్థుండగు నతనిచే నది తీర్పించుకొవం గలయదియై నవోఢ గావున మాటలం దేటపడం జెప్ప శంకించి స్త్రీ స్వభావంబునం దొరగు కన్నీరు కంకణ క్రేంకృతులు మీఱ గోరఁ బాఱ మీటుచు నూరకయున్నం గనుంగొని యవనిపతిపుంగవుం డంతరంగమునం దెంగలించు కౌతుకాంకురంబు కరఁగువడ వెఱఁగుపడి యుద్వేగసమన్వితుండై సంభ్రమించుచుఁ జెక్కుటద్దంబులం నొక్కి కురులు చక్కం దోయుచుం దోయజాక్షి యక్షయానంద సంధాయకం బగు నిట్టి క్రీడా సమయంబున వగపునకుం గారణం బేమి నాయెడం గల్ల యేమేనియుం బాటిల్లదుగదా యెవ్వరే మప్రియంబు గావించి రెఱింగింపు వారిం దండించెద నేమి సాధింపవలయుఁ జెప్పు మదివేధచేసున్న సాధించెద మదీయంబులగు నర్థజీవితంబులు భవదధీనంబు లమ్మ లిక యింతయేటికి యనుటయు నబ్బోటి గ్రేటుచు నిట్లనియె. 9

ఉ. అక్కట నాయెడ న్మిగుల ♦ నక్కర గల్గి చరించు నెచ్చెలుల్
చిక్కి మునీంద్రశాపహతిఁ ♦ జెందిన దుర్భమ రోగ బాధలం
బొక్కుచు నున్నవారు వన ♦ భూములఁ దద్దశ మాన్పవేని నా
కెక్కడి సౌఖ్యమన్నఁ దర♦లేక్షణఁ జూచి స్వరోచి యిట్లనున్. 10

క. పరితాప మింక నేటికి, హరిణాక్షి మదీయ సంచి♦తాయుర్వేద
స్ఫురణమునఁ బరిహరించెద, నరు దనగఁ భవత్సఖీజ ♦ నామయ భరమున్. 11

క. నా వెనుక రమ్ము నీ సఖు, లేవనమున నున్నవార ♦ లిపుడ చికిత్సం
గావింతు ననుచు రయమున, నా వనితయుఁ దాను నచటి ♦ కరిగి యొకయెడన్. 12

ఉ. ఆరజనీశబింబరుచి♦రాస్యలఁ గాంచి తదామయ వ్యథా
భారము మాన్పఁగా♦ దమి నృ♦పాలుఁడు తత్కులధాతగోత్రికాం
తారపదంబునం దుపచితం బగు మందును దత్క్రియోచితా
హారము నెమ్మి నిచ్చుచు న♦నామయ ధన్యలఁ జేసె వన్నెగాన్. 13

శా. ఆదివ్యాప్సరరాజిచేఁ దమమహా ♦ వ్యాధివ్యథల్ దీఱినన్
మోదంబంది లతాంగు లంబుజముం♦ఖుల్ నవ్యకందోయితో
సౌదామన్యభిరామ దేహరుచితో ♦ సంపూర్ణ చంద్రానన
శ్రీదర్పోన్నతితోఁ జెలంగి సురనా♦రీసూనుఁ గీర్తించుచున్. 14

క. మా కుపకార మొనర్చితి, నీకుం బ్రతిసేయు నెట్లు ♦ నేరుతు మైనన్
లోకోత్తర మాయలనను, జేకొను కార్యములఁ గలవు ♦ చెప్పెద మెలమిన్. 15

క. మాను మోదగు వృత్తాంతము, వినిపింపగవలయు నీకు ♦ విశ్రుతముగ భూ
వినుత వినుమనుచు నందొక, వనజేక్షణ పలికె మధుర వాగ్జితశుకియై. 16

తే. అనఘ మందారవిద్యాధ♦రాత్మభవను, నను విభావసియండ్రు గం♦ధర్వవరులు
తెలిసియుందుదు నిమ్మహీ♦తలమునందుఁ, బరఁగు మృగ పక్షి జాతుల ♦ భాషలెల్ల. 17

క. అమ్మేటి విద్య నాచే, నిమ్ముగ నంతయు నెఱింగి ♦ నృప నన్ను వివా
హమ్మగు మనవుడు రెండవ, కొమ్మ మదిం బ్రేమ గడలు♦కొన నిట్లనియెన్. 18

ఆ. పాఱఁ దనఁగ బరఁగు ♦ బ్రహ్మర్షి మా తండ్రి, యతఁడు విద్యలెల్ల ♦ నభ్యసించి
తపము నిచ్చఁ జేయఁ ♦ దలఁపోసి కీరభృంగాలి రమ్యమైన యాశ్రమమున. 19

మ. ఫలమూలచ్ఛదనాంబుభుక్తిఁ బవనా♦భ్యాస క్రియాయుక్తి ని
ర్దళితాంతర్గత శాత్రవ ప్రకరజా♦గ్రద్గర్వ సర్వస్వుఁడై
చలికిన్ వానకు నెండకున్ మన మను♦త్సాహంబు గానీక కం
దళితానందమునన్ ముకుంద చరణ ♦ ధ్యానావధానంబునన్. 20

క. అంగుష్ఠము నిలమోపి ప్ర, తంగునిపైఁ జూపు సాఁచి ♦ ధగధగ లర్చి
స్తుంగత నింగులు నాకెడు, నింగలములు నాల్గుదెసల ♦ నిడుకొని కడఁకన్. 21

క. సుర గరుడ యక్ష రాక్షస, నర కిన్నర సిద్ధ సాధ్య ♦ నాగోత్కర మి
ట్లురు జనఁగఁ దప మొనర్చెం, బురుహూతుఁడు దాన నాత్మఁ ♦ బొడమిన భీతిన్.

క. తనయొద్దఁ బుంజికస్థల, యను నచ్చరలేమ యున్న ♦ నమ్ముని కడకుం
జనుమని యనిపిన బతికో, సనమున వని కేఁగుదెంచె ♦ సంభ్రమలీలన్. 23

చ. చిలుకలు ముద్దుఁ గుల్కులకుఁ ♦ జేరఁగరా నెటివేణి కాంతికిన్
మలయుచుఁ బైపయిన్ మధుప ♦ మాలిక వాయక సంచరింపఁగా
నలసవిలాసయానమున ♦ నమ్ముని పాలికి వచ్చె వేల్పుఁ దొ
య్యలి సునుసోనఁ బట్టిన యన♦ంగుని మోహన బాణమో యనన్. 24

వ. ఆ సమయంబున. 25

చ. అనువగు ముళ్ల నొప్పు మల ♦ యానిలవాహము నెక్కి తేంట్లు న
ల్లిన నిడువాగెఁ బూని లవ ♦ లీ నవమల్లిక లెమ్మె సామ్ములై
పనుపడఁ జెట్టువట్టి మను ♦ పాత్రితదళమ్ములతోడఁ దోలె నా
మనిదొరమంచు రాజు మడి ♦ యించగఁ గోయిలగంట మ్రోయఁగన్. 26

సీ. సానదేఱి పోటమరించి సెలవాసిన యట్టి, యాకురాలపు గండ్ల ♦ యందుఁ దాలఁగి
యలిబాలకీరచ్ఛ ♦ దాంకురా కృతిఁ బొల్చి, కరవీరకోరక ♦ గతిఁ గ్రమమున
నరుణంపుమొగ్గలై ♦ యరవిచ్చి పికిలి యై, కలదండులట్లు గుం ♦ పులయి పిదప
రేఖ లేర్పడఁగ వ ♦ ర్ధిలి వెడల్పయి రెమ్మ, పసరు వాలుచు నిక్కఁ ♦ బసరుకప్పు

గీ. పూఁటపూఁటకు నెక్కఁ గ ♦ ప్పునకుఁ దగిన
మెఱుఁగు నానాఁటికిని మీఁద ♦ గెలిగొనంగ
సోగయై యాకువాలంగ ♦ జొంప మగుచుఁ,
జిగురు దళుకొత్తెఁ దరులతా ♦ శ్రేణులందు. 29

క. హిందోళంబునఁ బాడిరి, బృందారక సతులు విరహి ♦ బృందార్తిగఁ బ్రేఁ
చెం దేటులు వాసంతిక, విందునఁ బికశిశువు దాది ♦ వెడలం దోలెన్. 28

సీ. చలిగాలి బొండుమల్లెల పరాగము రేఁచి, నిబిడంబుసేసె వె ♦ న్నెలరసంబు
వెన్నెల రస మబ్బి ♦ వెడలించె దీర్ఘికా, మందసౌగంధిక ♦ మధువదంబు
మధువదం బెగఁ బోసె ♦ మాకందమాలికా, క్రీడానుషంగి భృం ♦ గీరవంబు
భృంగీరవం బహం ♦ కృతిఁ దీఁగ సాగించెఁ, బ్రోషితభర్తృకా ♦ రోదనముల

గీ. విపిన వీధుల వీతెంచె ♦ గుపితమదన,
సమదభుజనతసుమధను ♦ ష్టంకృతములు
సరసమధుపాన నిధువనో ♦ త్సవవిలీన,
యువతి యువకోటి కోరికల్ ♦ చివురులొత్త. 29

క, అత్తఱి మారిషపు నడఁ జెలి, కత్తియగమి గొలువ మృదుల ♦ కలభాషలఁ ద
ళ్కొత్తెడు వెడనగవులతోఁ, జిత్తభవుం డార్యవనలు ♦ చిదుమ నెపమునన్. 30

చ. అలకనిబీటులోఁ గుసుమ ♦ మద్దిన పావడ దోఁపఁ గొప్పు చెం
గలువలనల్పఁ జున్నఁగవ ♦ కస్తురితావియుఁ దొస్తరింప సం
దలరొద పీఁటఁ బెన్నిధిగ ♦ తిన్ బ్రవతికిం బొడకట్టె వేల్పుఁ దొ
య్యలి చిఱుసానఁ బట్టిన య ♦ నంగుని మోహన బాణమోయనన్. 31

తే. అత్తఱింగూన నదిరి పా ♦ టారజంపు,
వన్నెఁ బొడకట్టి తాఁ బాడు ♦ సన్నరవళి
పాట లళిఝంకృతి క్రితిఁ ♦ బాడుకొనఁగ,
జాడకయ చూచుచూపుతో ♦ నుడియుటయును. 32

చ. తలకొని దాని తమ్మిలపుఁ ♦ దావియు మోవియుఁ గాను మేను న
గ్గలపు మెఱుంగు లీను తెలి ♦ గన్నులుఁ జన్నులు భృంగమాలికన్
గెలిచిన యారుతీరుఁ దగు ♦ నెన్నడలుం దొడలున్ వివేకమున్
గలఁపఁగ గాంచి పంచశర ♦ కాండ విఖండిత ధైర్యసారుడై. 33

క. మేను గరుపాఱఁ దపిం న, మౌని జపముఁ దపముఁ దన్ను ♦ మఱచి యనంగ
గ్లానిఁ బడి కదిసి వడఁకుచు, హీనస్వర మెసఁగఁ బ్రోవవే నన్ననుచున్. 34

తే. చెయ్యి వట్టిన మాత్రాన ♦ శిరసు వంచి, యువశ చందానఁ బైపాటిలు ♦ నవ్వధూటిఁ
బర్ణశాలాంతరముఁ జేర్చి ♦ బ్రాహ్మణుండు, కెరలు కోర్కులఁ గందర్ప ♦ కేళిఁ దేలె.

క. తపమంతయుఁ బొలివోపఁగ, నపు డన్నియు నుజ్జగించి ♦ యయ్యంగనతోఁ
దపసి మనోజక్రీడా, విపులైశ్వర్యంబు లనుభవించుచు నుండెన్. 36

క. ఈరీతిఁ గొంత కాలం, బా రామ మహా మహీధ♦రా రణ్యములం
దారామ వలలఁ దగిలి వి,హారము సలుపంగ గర్భ♦మై తటి యగుడున్, 37

క. అంత ననుఁ గాంచి యది విపి,నాంతరమున బాఱవైచి ♦ యరిగెఁ గృపార్ద్ర
స్వాంతుఁడగు సంయమీంద్రుఁడు, జింతింపక పోయె నేమి ♦ సెప్పుదు నధిపా. 38

వ. అట్లు వైచి చనుటయు నాఁకటం గటకటం బడుచుండి తీండ్రించు శశిమండలం బున వెడలు శిశిర కిరణ పరిణాలి కామినీ దమృత రసగ్రాసంబునం జేసి కొన్ని పూటలం బుటపుటనైన నన్నుం గనుఁగొని మునీంద్రుఁడు ప్రియంబంది నిజాశ్రమంబునకుం గొని చని శశికళాసంవర్ధిత నగుటం జేసి నాకుం గళావతియను నామం బిడి పెనుచుచుండ నేనును జనక సేవా పరతం బ్రవర్తిల్లుచుండు నంత. 39

ఉ. ఆ సమయంబున బొగులం ♦ బాఁకటిపిల్లన నంతకంతకున్
గానిలి పై పయిన్ వదన♦కహ్వార మెండఁగ నేడ్చి యేడ్చి యే
మౌనఁయు గాన కంత దుహి♦నాంశుఁడు దోఁచినఁ దత్కళారస
గ్రాసవిధిన్ శరీర మహ♦రంగ భజించితి దైవికంబునన్. 40

సీ. ఏవిధంబున ♦ మేను పెంచుచుండ, నా చందమంతయు ♦ నాత్మ నెఱిఁగి
కడు సంభ్రమమున న♦క్కడికి నేతెంచి యిం,పెసగ మై నిండిన ♦ కసటు దుడిచి
తన యురంబునఁ జేర్చు♦కొని పోయి యాశ్రమ, స్థలమున నిజపర్ణ♦శాల నునిచి
విధుకళాంశ పోష♦విధి వసించితిఁ గాన, నాకుఁ గళావతీ ♦ నామ మొసఁగి

గీ. వయసు మీఱంగఁ బెనుప నా♦నాఁటఁ బెరిగి,
శైశవము మాని యౌవనో♦త్సవముఁ జెంది
జనకు సేమైన నడగుచు ♦ సంతతంబు,
నోపి శుశ్రూష చేయుచు♦నున్న చోట. 41

క. ఎవ్వారు చూచినఁ జూపుల, చివ్వకుఁ బడ నడఁగి నడచు ♦ సిగ్గున నొఱపై
రవ్వకు మొదలగు పాపపు, జవ్వన మెదిరించె జిగియొ♦సఁగ నామేనన్. 42

శా. ఆవేళం బొడఁగాంచి ఖేచరుఁ డొకం ♦ డాసక్తి దేవాపి సం
జ్ఞావంతుండు సబాంధవుండగుచు నిశ్శంకన్ ననున్ వేఁడు వాఁ
డై వాచంయముఁ డగ్నికార్యనిరతుం♦డై యున్నచోఁ బర్ణశా
లావాసంబున కేగుదెంచి నిజభా♦వాకాంక్ష సూచించినన్. 43

సీ. శిఖిపించదళ పరిష్కృతమూలై సేమంతి, విరుల తీరగు శిరో ♦ వేష్టనములు
నెఱిగంటి చూడ్కిఁ దా♦రొతుల బాహులు వంచి, నారాజులల్లార్చు ♦ నారజములు
గాదంబరీగంధ ♦ గర్భంబులై వల్చు, ఘనసారమిళ దాస్య ♦ గంధములును
దరహాసములఁ దోఁచు ♦ తాంబూల సేవాంధకారితాధరరద♦ద్యుతుల యొఱపుఁ

తే. జీటులు గందంపుఁ బూఁతలు ♦ జిహ్వికలును,
ననుపు నెఱవాది బంటుపం♦తపుఁ బదరులు
ఘనమగు జాగుపన్న వెనుప న♦జ్జనముఁ జూచి
ఋషి మనంబునఁ గడు నస♦హ్యించుకొనుచు. 44

శా. ఆహా ధన్యుఁడనైతి మద్విమల వం♦శాచార విద్యా తప
శ్శ్రీహోమాదులు నేఁడుగా తుది ఫలిం♦చెన్ నాగవాసంబు మ
ద్దేహాశ్లేషికి బిడ్డ వేఁడుటకు నే ♦ తేఁ గాంచుటన్ బ్రాహ్మ్య మిం
కోహో ! చాలు బొకాలిపోయెదరొ పో♦రో నోటి క్రొవ్వేటికిన్. 45

క. హీతరమావార లేతతి, నేతరితనమునఁ దపస్వి ♦ గృహాకన్యకలన్
వీతభయవృత్తి వేఁడిరా, కోతముఁ దర్కింప కొఱ ♦ క్రొవ్వులటంచున్. 46

క. వసుధేశ మక్కడుసన్నిన, పసరము క్రియఁ గరలి తిట్టెఁ ♦ బక్కున ఋషి వా
రుసురు మని వెడలిపోయిరి, మొసలిగదా పుట్టినిల్లు ♦ ముఖ్యోల్బణతకున్. 47

వ. అట్టియెడం దన మనోరథంబు విఫలం బగుటకుఁ గ్రోధాంధుండై నన్నభిలషించు గంధర్వుం డిట్లనియె. 48

శా. నీవై శిష్యము తిట్టుల న్మొఱియు నే ♦ నీకంటె నేఁ దక్కువే
యీవే కన్యక నీవు కాక మఱి♦ మద్వృత్తాన్వయాచారముల్
నీవా పేర్కొను పాటివాఁడ విలఁగా ♦ నీనిల్తు గాకేమి పో
పో విప్రాధమ నిన్నుఁ బోల నిక న♦ల్పుల్ లేరు దంభవ్రతా. 49

తే. అనుచుఁ బగచాటి పోయి వాఁ ♦ డర్ధరాత్రి,
సమయమున శస్త్రనిహారి ♦ మజ్జనకుఁ జంపె
నట్లయగుగాక పుడమిఁ గామాంధ చిత్తు
డెవ్వరి వధింప డెటు సేయఁ ♦ డేమి గాదు. 50

తే. అప్పుడు మెడ గోయ ముని రోజా ♦ టాలకించి,
మేలుకొని దివ్వె యిడి సంభ్ర♦మించి యేడ్చు
నన్నుఁ బొడవిరి పొరుగిండ్ల ♦ నున్న తపసు,
లా దురాచారుఁడును బాలె ♦ నటకు మనుప. 51

వ. అంతం జెలదిల వేగుటయుఁ బ్రభాత సమయంబున. 52

క. ధారాళితశతజోక్షిత, ఘోరజరాధవళితోరు ♦ పూర్చముగఁ గరా
చోరిని మెడ దెగియుట జా, గారంబునఁ బడిన మూఁడు♦గాళ్ల ముసలికిన్. 53

ఆ. అగ్ని యిచ్చి యాకట ♦ యా బాల్యమగ నన్నుఁ, బెనిచె దల్లి వైచి ♦ చనిన పిదపఁ
దానె తల్లిమాఱు నై నెమ్మినట్టి మజ్జనకుఁ డీల్గ నేఁటి ♦ మనికి యనుచు. 54

క. వందురి వగలన్ దేహము, పొందెడలఁగఁ జూమ నన్నుఁ ♦ బొడగని దివి దా
నందుల తెగుచునో గిరినందన దిగి వచ్చి కరుణ ♦ నాకిట్లనియెన్. 55

మ. అతిసౌందర్యనిశాంత మీతను వ♦లభ్యం బిట్లు శోకాతురా
న్వితవై దీని దొలంగఁగాఁ దగునె త♦న్వీ చాలు నీ సాహసం
బిదిలోకుండు స్వరోచి నీకు బతియా ♦ నా రాజ్యఁ జేపట్టి యు
ప్రతిమ శ్రీవిభవంబు గాంచెదవు నా ♦ పల్కుండుగా నేర్చునే ? 56

క. విను మదియుఁగాక పద్మిని, యనఁ బరఁగిన విద్య నేఁ ♦ బ్రియంబున నిత్తుం
గొను నీవు తత్ప్రసాదం,బున నీకునభీష్ట సౌఖ్యములు సిద్ధించున్. 57

వ. అని రహస్యంబుగా నవ్విద్య నాకు నుపదేశించి ముక్కంటి వాల్గంటి మింటిచొప్పునం జనియె నేనును తద్వచనామృతాస్వాదనంబ యూఁతగాఁ బ్రాణంబులు పట్టుకొని యున్నదాన. నా స్వరోచి నీవ కాఁ దలంచెద. వంచనాలాపంబు లుడిగి యుప్పద్మినీ విద్యారత్నంబుతోఁ గూడ నన్నుం బరిగ్రహింపు మనిన నంగీకరించి యమ్మహీవిభుండు. 58

క. ఏకాగ్రత నవ్విద్యలు, గైకొని పుణ్యాహపూర్వ♦కంబుగ గుణర
త్నాకరుఁ డయ్యిద్దఱ న,స్తోకోన్నతిఁ బెండ్లియయ్యె ♦ సుముహూర్తమునన్, 59

ఉ. ఆ సమయంబునన్ మొరసె ♦ నభ్రపథంబున దేవదుందుభుల్
సేసలు చల్లి రచ్చరలు ♦ సిద్ధనికాయము చేరి సన్నుతుల్
సేసెఁ బ్రసూనవృష్టి గురి♦సెన్ జనరంజనకారి వాసనో
ల్లాసములై చెలంగ శుభ♦లక్షణ దక్షిణ గంధవాహముల్. 60

క. ఈ విధమున నుద్వాహం,బై వేలుపువెలఁదిపట్టి ♦ యంచితమతి న
ప్పూవుంబోఁడులు మూవురతో వివిధవిహార సంగతులఁ దత్పరుఁడై. 61

సీ. గంగాతరంగిణీ ♦ రంగత్తరంగ శీకర శీతసైకతో♦త్కరములందు
మందారమాకంద ♦ మకరందతుందిలేం, దిందిరానంద కృ♦న్నందనములఁ
గాంత నీలాకాంత ♦ కాంతవిశ్రద్ధికా, క్రాంత భూభృద్బృంద ♦ కందరముల
మసృణవిసాహార ♦ మాంసల హంసికా, సంపదాసార కా♦సార తటుల

గీ. దమక తమక ప్రియుండని ♦ తమక మెసఁగఁ,
బడతు డుపాంగఁ గ్రీడించె ♦ బద్మినీ ప్రి
యావఘటితాన్నపాన భూ♦షా విశేష,
మాల్య వస్త్రానులేప సా♦మగ్రిఁ జెంది. 62

మ. అరవిందాక్షులు దాను నిట్లభిమత ♦ వ్యాపారముల్ సల్పుచున్
ధరణీశుం డొక చోట గాంచె లఘు శీ♦తస్వచ్ఛవాః పూరమున్
వరకీరవ్రజ చంచుపాటిత తట♦వ్యాకీర్ణ మందార శే
సరమాకంద వినిస్సర త్ఫలరసా♦సారంబు గాసారమున్. 63

క. కని తత్తట స్థలంబున, ననుమతి విహరించె సవిధ ♦ హరిహయ వరనం
దన నందన హరిచందన, ఘనపవనార్భక వినోద ♦ వశగతు డగుచున్. 64

ఉ. అందొక యంచ శేష గహ♦నానిల సంచల దూర్మిమాలికా
మందవిహార సౌఖ్యమున ♦ మత్తిలి దవ్వుల నున్న చక్రవా
కిం దగఁ జేరఁబిల్చి పరి♦కించితె యెంత తపంబొనర్చి రీ
యింపని భాగ్యలుం బతియు ♦ నేకమతిం గవగూడి యుండఁగాన్. 65

క. మెలతకు బతిపై నైనను, మెలతుకపై బతికి నైన ♦ మేలగు టెందుం
గలయది మెలఁతకు బతికిన్, వలవు సమంబగుట జన్మ♦వాసన చెలియా. 66

ఉ. కావున వీరి యందు నధి♦కంబగు కూరిమి గల్గియుండు నీ
భూవలయాధి నాథునకుఁ ♦ బొల్పుగ నీవిభునందు నగ్గలం
బీ వనజాయతాక్షులకు ♦ నిచ్చఁ బ్రియంబది గాన పూవునుం
దావియు పోలెఁ జాలఁ బ్రమ♦దం బొనరించిరి నాకు నెచ్చెలీ. 67

వ. అని పలుకు నమ్మరాళలోలనయన పలుకు లాలంబుచేసి చక్రవాకి యిట్లనియె. 68

చ. మదమున నిమ్మహీశుఁ డొక ♦ ముద్దియ చూడగ నొక్క కాంతతో
సదమదమై కడంగి రతి ♦ సల్పుట తెల్లమిగా నెఱింగియుఁ
మది వివరించి రోయ కభి♦మానము దక్కిన వీరి కూరుముల్
వదలక పెద్ద సేసెదవు ♦ వందిగతిం దగవీ విచారముల్. 69

చ. పలువురయందు నొక్కనికి ♦ బ్రీతియు నొక్కనియందుఁ జూడ న
గ్గలమగు ప్రేమ పల్వురకుఁ ♦ గల్గుట యద్భుత మటు గాన యి
వ్వెలఁదులయందుఁ గూర్మి పస ♦ వీనికి నేమియు లేదు వీనియం
దలవడఁ గల్గదీ జలరు♦హాక్షులకుం బ్రియ మెవ్విధంబునన్. 70

క. మను జేశుఁడు గొలిచిన పరి, జనములతో నిష్టగోష్ఠి ♦ సలిపెడిచో నె
ల్లను రాగ మట్లు కూరిమి, వనితలు పెక్కండ్రయందు ♦ వశ్యము పలికెన్. 71

క. ఈ నెలఁత లీ మహీశున, హీనగతిం బగిలి రేని ♦ నితఁడొక లేమం
దా నెలమిఁ గూడు నెడ నే, మానిని ప్రాణేశు మీఁది ♦ మమత మెలంగున్, 72

క. కావున దాసీనికరము, కైవశమై సంచరించు ♦ క్రమమున విద్యా
ప్రావీణ్య వైభవోన్నతి, చే వచ్చిన వారి వీరిఁ జెప్పెద మింకన్. 73

ఆ. తగులు చెప్పఁ డొక్క ♦ తరుణికి నొకనికి, మెలఁత వలచు నదియు ♦ మేలసంగ
వచ్చు గాని పెక్కు ♦ వనితలపైఁ గూర్మి, గలుగు నసుట బొంకు ♦ గాదె తరుణి. 74

ఉ. పలుకులు తేయు నేమిటికి ♦ భాగ్యసమున్నతి నేనము ద్విభుం
డిలఁ గల ధన్యుఁడంచు నెలు ♦ గెత్తి వయూధిని పట్టి మూండటం
బలుకు రథాంగమానవతి ♦ పల్కు లతం డిల జంతుమండలీ
విలసద శేవభామలఁ బ్ర ♦ వీణుఁడు గాన రమింగి సిగ్గునన్. 75

క. తల వాంచి యయ్యుర్వరని మదిఁ, దలపోయుచు మానరాని తమకంబున నా
నెలఁతలతో నూతేఁడులు, విలసితగతి సౌఖ్య మనుభ ♦ వించుచు నెలమిన్. 76

శా. కాంచెన్ భూవిభుఁ డొక్కనాఁడు కన కా ♦ ఖర్వ ప్రభామంజులా
స్యాంచన్ మేచకరత్న విభ్రమ సనా ♦ థానూన దృగ్రోచులన్
మించుం బ్రాయపు లేటిపిండు తను గూ ♦ ర్మిం జుట్టి రా దవ్వునో
దంచద్భూమి జరించు నొక్క హరిణో ♦ త్తంసంబు నింపారగాన్. 77

క. కని సతులకుఁ జూపెడుతఱి, ఘనముగ దమ చెవుల వాలు ♦ గన్నులు సోలన్
మొనసెలవి రొత్తి ప్రియునా, ననమున్ మూర్కొనుచు నట్టు ♦ నాకడు వేళన్. 78

శా. హుంకారం బొనరించి పే తలఁగుఁ డో ♦ హో నేను స్వారోచినే
పంకేజాక్షులతోడ నెల్లపుడు ద ♦ ర్పస్ఫూర్తిఁ గ్రీడింప ల
జ్జాంకూరం బడగించినారు తలపో ♦ యన్ నాకు రోఁతయ్యె మీ
రింకం బోయి వరింపుఁ డొక్కరుని భో ♦ గేచ్ఛన్ నివారించితిన్, 79

చ. బరువన కింతులం దనకుఁ ♦ బల్వురఁ గూర్చుట భోగవాంఛ గా
కరయఁగ నొండు గాదు ఘన ♦ మన్న ధ్రువంబుగ నంగనాజనా
త్కరసముపార్జితం బటులు ♦ గావున వీనికి లే దిహంబునుం
బరమును నన్న నట్లు పలు ♦ పం బనిలేదిది చెప్ప నేటికిన్. 80

క. వీనివిధంబున వనితా, ధీనుఁడనై పెంపుదక్కి ♦ తిరుగుచు నుండం
గా నే నెట్టిన తమకము, మాని వనుం డన్న నవియు ♦ మసలక చనియెన్. 81

క. ఈ కరణి దూఱి నాడిన, యా కృష్ణమృగంబు పల్కు ♦ లట మున్నుగ న
క్కోక నతి యన్న మాటలు, నేకంబై తన మనంబు ♦ నెఱియం జేయన్. 82

ఆరయ నిట్టి రోఁతలకు ◆ నాలయమౌ జలజాక్షు లేటికిన్
వీరలతోడి సంగమిఁక ◆ వీడెద నంచుఁ దలంచి తోన దు
ర్వారములైన కోరికల ◆ వంక వివేకము చొప్ప దక్క యిం
పారఁగ నాలునాలు సుర◆హాయనముల్ చరియించె గ్రమ్మఱన్. 83

వ. తదనంతరంబ క్రమక్రమంబున మనోరమయందు విజయుండును విభావసియందు మేరునందనుండును కళావతియందు విభావసుండు నను నందనులం గాంచి పద్మినీ విద్యా ప్రభావంబునం బాకశాసనదిశాముఖంబున విజయునకు విజయాఖ్య పురంబును గిన్నరేశ్వర హరిదంతంబున మేరునందనునకు గంధవతి యను పుటభేదనంబును దక్షిణంబున విభావసునకు ధారాహ్వయోదార మహానగరంబునుం గల్పించి యనల్ప విభవంబున నక్కుమారుల నప్పట్టణంబులకు బట్టంబుకట్టి కృతార్థుండై యొక్కనాడు. 84

ఉ. శాసితశత్రుజాతుఁ డా నృపతి ◆ చంద్రుఁడు తూణధరుండు సజ్యబా
ణాసనపాణిపంకజుఁడు ◆ నై మృగసంఘము చెల్లఁ బెల్లు సం
త్రాసమునొంద గ్రూరత న◆రణ్యమునన్ మృగయా కుతూహలో
ల్లాసమునం జరించె జల◆లక్ష్యవిభేద విధావధానుఁడై. 85

క. కుటిలకృశసాంధ్యరజనీ, విటకోరక కోమలచ్ఛ ◆ విస్ఫుటదంష్ట్రో
ద్భట పోత్రఖనిత్రాగ్ర, స్ఫుటిత వనీధాత్రి నొక్క ◆ పోత్రిం గనియెన్. 86

సీ. జంభారిభిదుర సం◆రంభంబు వీక్షించి, జరుగు నంజన మహా◆శైలమనఁగ
ఝుంఝాప్రభంజనా◆స్ఫాలనంబున కుల్కు, నరుగు సంవర్త కా◆లాభ్రమనఁగ
గరిసకంఠేకాల ◆ కంఠమూలమువాసి, వెసవచ్చు నుజ్జ్వల◆క్ష్వేళ మనఁగఁ
గలుషదుర్వహాఖిలో◆త్కరముపై బఱతెంచు, దండధర క్రూర ◆ దండమనఁగ

తే. ఘుర్ఘురారావ సంఘాత ◆ ఘూర్ణమాన,
సప్తపాథోధిపాథః ◆ ప్రచండనక్ర
తిమితిమింగల మగుచు న◆భ్రభ్రమాను మహీయము,
గ్రమ్మకొని వచ్చు నొక యేక◆లమ్ము గనియె. 87

మ. కని మౌర్వీనినదంబు సేయుచు భుజం◆గక్రూర నారాచముం
దన దోర్దండ కృతాంత దండనిభకో◆దండంబునం గూర్చి బో
రన సేయం దమకించుచుండ నొక సా◆రంగాంగనా రత్న మ
జ్జననాథాగ్రణి జేరి పంచజన భా◆షాప్రౌఢిమై నిట్లనున్. 88

క. నృప యీ క్రోడము నీకే, యపకారము సేసె దీని ◆ కలుగఁగ నేలా
కృప మది తోఁపక నాపై, నిపు డీ శరమేసి నిగ్రహించుట యొప్పన్. 89

క. అని పలుక నతఁడు నీవీ, తనువుపయిన్ రోయుచునేల ♦ తద్దయు గృశవై
యునికియు గాదు గదా చెపు, మనవుడు నా హరిణి పల్కె ♦ నవనీపతికిన్. 90

తే. అన్యపతులయందు ♦ నాసక్తుఁడగువాని, దమక మొదవి కూడ దలఁచుకంటె
మరణమైన మేలు ♦ మతి వితర్కింపంగ, ననుచు బలుకుచుండు ♦ నవనివిభుఁడు. 91

క. తామకహృదయుం డెవ్వని, పై వదలక నిలిచె నీదు ♦ భావము తెలియం
గా గలయు జెప్పుమన్న ధ, రావల్లభుతోడ హరిణి ♦ క్రమ్మఱ ననియెన్. 92

చ. వెదగక నా మనంబు నృప ♦ శేఖర నీయెడ నిల్చి మన్మథ
ప్రదరపరంపరాభిహతి ♦ పాల్పడి వేగెడు నట్లు గాన నా
యెద దపగింపుమన్న మహి ♦ కాంగన నీవు నరుండ నే మృగం
బౌదవగ నీకు నాకు మిథు ♦ నోచిత కృత్యము లెట్లు చేకురున్. 93

క. నావుడు నను నాలింగన, మీవనురాగమున జేయ ♦ మింతియ చాలున్
భూవర యున్న గృపార్ద్రుఁడు, గావున నా నృపతి హరిణిఁ ♦ గౌగిటఁ జేర్చెన్. 94

సీ. వల్లిమతల్లి లా ♦ వణ్య సర్వస్వంబు, విమలాంగరేఖ నా ♦ విర్భవింప
మంజుల మంజరీ ♦ మహిత సౌభాగ్యంబు, పరివృత్త కుచవృత్తి ♦ బరిణమింపఁ
బల్లవచ్ఛవచారు ♦ భావానుభావంబు, మృదుహస్తలీల మూ ♦ ర్తీభవింప
రమణీయ కుసుమఫల ♦ ప్రభవ భాగధేయంబు, కరరుహస్ఫూర్తి సా ♦ క్షాత్కరింపఁ
తే. జేసి మృగియై వహించు న ♦ క్షీద్వయంబు
భాసురంబుగఁ దనయంక ♦ పాళిలోన
మించు కోర్కిమ్మించు నుపమించు ♦ మెలఁత యగుచు
నిలుచు నవ్వనదేవత ♦ నృపతి సూచి. 95

క. పూని విస్మయరసమున, మానిని మృగివై చరించి ♦ మతి యంగనవై
కానంబడితివి చిత్రం, బే వెన్నఁడు నెఱుఁగఁ జెప్ప ♦ వే తెలియంగన్. 96

సీ. నావుడు నమర కాం ♦ తా తనూభవుఁ జూచి, యవ్వనదేవత ♦ యనె నరేంద్ర
సకల భూభువన ర ♦ క్షా దక్షు మనువర్య, నీయందు బడయ నెన్నిక సమస్త
దివిజులు నన్నుఁ బ్రా ♦ ర్థించిన వచ్చితి, ననురాగవతి నైన ♦ నను వరించి
పడయుము నాయందు ♦ పత్యంబు దీన నీ, కగు బుణ్యలోక సంప్రాప్తి యనిన
గీ. నట్లు గాకని యయ్యంబు ♦ జాయతాక్షి, నేకచిత్తంబుతోడ నం ♦ గీకరించె
బాల యిట్లు సుఖాంబుధి ♦ దేలుచుండి, యంత గర్భిణియై శుభం ♦ బగు దినమున. 97

శా. గాంచెం బుత్రు విశాలనేత్రుఁ బృథువ ♦ క్షఃపీఠ భ్రాజితుం
బంచాస్యోద్భట శౌర్య ధుర్య ఘన శుం ♦ భద్బాహు దేజోనిధిం
బంచాస్త్ర ప్రతిమాను మాఘ సా ♦ మ్రాజ్య శ్రీ హేతు భ్రూ
[illegible] చల్లత్పుణ్యలక్షితాంగున్ సుగుణ గ ♦ ణ్యానీక రత్నాకరున్. 98

క. [illegible] నాసిరి సుర సతులు కిన్న ♦ రాంగన [illegible]
నాడిరి గంధర్వులు గొని, యాడిరి సురతూర్య నినద ♦ మగ్గలమయ్యెన్. 99

తే. అట్లు జనియించి స్వారోచి ♦ షాఖ్య నతఁడు, శాంతి దాంతి దయా సత్య ♦ శౌచనిరతుఁ
డై ధరామరతతిఁ జెలిమిఁ ♦ బ్రోచరించె, నచ్యుతుని గూర్చి యంత గృ ♦ పార్ద్రుఁ డగుచు.

సీ. నీలమేఘముడాలు డీలుసేయఁగ జాలు, మెఱుఁగుఁ జామనచాయ మేనితోడ
నరవిందముల కచ్చు నడగించు జిగిహెచ్చు, నాయతంబగు కన్ను దోయితోడ
బలుఁగురాయని చట్టు పలవన్నె నొగవెట్టు, హొంబట్టు జిలుఁగు గెంటెంబుతోడ
నుదయార్కబింబంబు నొఱపు విడంబంబు, దొరలంగ నాడు కౌస్తుభముతోడ
గీ. జయజయధ్వని మౌళి నంజలులు సేర్చి, శర్వ శతధృతి శతమన్యు శమన శరధి
పాలకైలబిలాది దేవాళితోడ, నెదుట బ్రత్యక్షమయ్యె లక్ష్మీశ్వరుండు. 101

క. ఈ తెఱఁగున దోఁచిన హరిఁ, గాంతుడు సాష్టాంగ మెఱఁగి యంగము పులకా
న్వితంబుగ హర్షాశ్రువు, లెతెరఁగ జూచి భక్తి నిట్లని పొగడెన్. 102

కవిరాజవిరాజితము

జయజయ దానవదారణ కారణ శార్ఙ్గరథాంగ గదాసిధరా
జయజయ చంద్ర దినేంద్ర శతాయుత సాంద్రశరీర మహఃప్రసరా
జయజయ తామరసోదరసోదర చారుపదోజ్ఝిత గాంగఝరా
జయజయ కేశవ కేశినిషూదన శౌరి హరీ దురితాపహరా. 103

సీ. అవ్యయానంత విశ్వాత్మక విశ్వేశ, బ్రహ్మవు నీవ కపర్ది నీవ
యింద్రుండ నీవ వహ్నివి యనిలుడ నీవ, వరుణుండ నీవ భాస్కరుడ నీవ
సోముడ నీవ వసూత్కరము నీవ రుద్రులు, నీవ యాదిత్యులు నీవ విశ్వు
లీవ మరుత్తులు నీవ మంత్రములు నోంకృతివషట్కృతి శ్రుతి స్మృతులు నీవ
తే. వేయు నేల యీ వచ్చిన విబుధగణము, సర్వమును నీవ యెట్లన్న సర్వగతుడ
వగుట మఱి నీవు గాని వాఁడనఁగ నెవ్వఁ, డరయఁగను శేషభూత సమస్త శేషి 104

మ. పరతత్త్వంబగు నీకు మ్రొక్కెదఁ గరముల్ పద్మాక్ష కీర్తించెదం
బురుషార్థస్థితి నొప్ప నిన్ను గరుణాంభోధిన్ భవార్తున్ జడున్
శరణార్థిన్ నను గావఁగాదగు బ్రధానవ్యక్త కాలాత్మ యీ
శ్వర భూతంబుల కీవె కర్తవును బ్రోవన్ భర్తవున్ హర్తవున్. 105

చ. విలయతమిస్రవేళ నతివేల మహాంబుధి నూర్ధ్వలోక వా
సులు నతులై కనుంగొనెడు చూడ్కుల కార్వహుతాశన క్రియా
కలితగతిన్ వెలుంగు ఘనకాయవిజృంభణ జోఁక మీనవై
కలయఁగ గ్రోలు నీవెడద కన్నులఁ బ్రోచు మమున్ మురాంతకా. 106

చ. చటులకృపీట సంస్థితర సాస్థలి క్రీలక యుండ గారయి
చ్చుటకును బోలె శంఖమణిశుక్తికదంబము నుగ్గుగా విశం
కటవరమాంగ మంథగిరి ఘట్టనఁ జేసి ఘరట్టమై కృపా
పటిమ జగంబు బ్రోచు నలప్రాక్కమఠంబు నినున్ భజించెదన్. 107

చ. ఉరుతరవిగ్రహస్ఫురణ నుబ్బిన నీరు పరిచ్ఛిదా ముఖాం
తరమున దోరమై యెగయు ధార నజాండము గాజుకుప్పెతో
సరియనగా దలాతల రసాతల సీమలు సించి ధాత్రి న
ద్ధరణి మొనర్చినట్టి నిను నాదివరాహము నాశ్రయించెదన్. 108

మ. కరుణించుమీ మము నట్టి నీదు భుజయు♦గ్మం బెగ్గి పూనెన్ నభో
తర సీమన్ దితిజాంత్రిసత్త్ర నఖసం♦తానంబుతో నో నృకే
సరి రాత్రించర భీతికై త్రిభువనా♦స్థానీయ వీధిన్ విక
స్వరశోణప్రగలంకృతక్రకచధా♦స్వత్తోరణ స్తంభతన్. 109

చ. దనుజకులేంద్ర దత్తకర♦తామరసస్థిత దానిధారచే
ననిమిష దైన్య దుఃఖిత మ♦హాముని మండల దృశ్య కశ్యపాం
గన నయనాంబువుల్ గడిగి♦కంజభవాండము మోవ లీలమై
బెనిచిన దంభ వామను సు♦పేంద్రుని నిన్ను సమాశ్రయించెదన్. 110

చ. తనదగు సంతతిం గనలి♦తానె వధించిన పాపముల్ చెడన్
మునిగెడు నాగుణోగ్రకిణ♦ముల్ మొనయంగ శమంతపంచక
మ్మున బితృతర్పణచ్ఛలన♦మున్కలు పెట్టు భవద్భుజా యుగం
బున కిదె వందనంబు భృగు♦పుంగవరూప విహంగవాహనా. 111

మ. పవిధారాపతనంబు గైకొనని య♦ప్పౌలస్త్యుమై సప్తధా
తువులం దూలు పరిశ్రమంబునకు స♦ద్యోగించి నాసప్తసా
లవిభేదం బొనరించి నిల్వక స♦లీలం జన్న యోవత్త్రిస్మరు
జ్జనసాస్త్రంబు బొసంగుమీ సిరుల్ రఘుకుల♦స్వామీ రమావల్లభా. 113

క. పెరుగు ప్రలంబుని పీపునఁ, గరిపై హరివోలె విశద♦కాంతి నిలిచి త
త్కరణం బారాటముగా, బరిమార్చిన నీదు బలిమి♦బ్రణుతింతు హరీ. 112

తే. కొలుతుఁ దారళ్ఘ్భవద్బాహు♦కులిశయష్టి
నెగ్గి గిరివోలె గడుపులో♦వృద్ధిపొందఁ
బగిలి రాకాసిదేహంబు♦మొగపు మిత్త్య
మయ్యె మంగామురారి రం♦గై మురారి. 114

క. కృతయుగ మేతేర నలం, కృతికై శాశ్వరపంక♦మిడి యలుకు క్రియన్
క్షితియెల్ల మ్లేచ్ఛరక్త, ప్లుతముగ గావుంచు రాతు♦బొగడెద నిన్నున్. 115

వ. అని ప్రస్తుతించినం బ్రసన్నుండయి పాంచజన్యధరుండు వాత్సల్యంబున వత్సావరంబు వేడుమనుటయుం బ్రసాదంబని స్వాశిచిపుం డిట్లనియె. 116

క. దేవ భవద్దాస్య సుఖం, బేవేఁడెద దయకుఁ దగుదు♦నేసాలోక్యం
బీవే యితరము లొల్లన్, నావుడు నాతనికి బద్మ♦నాభుం డనియెన్. 117

క. సాలోక్యము దుది నిచ్చెద, నేలు మిల ద్వితీయ మనువ♦వీవైన యథ
ర్మాళోల బుద్ధి దిరముగ, వేలంపులకు దపసులకును♦విధికి బ్రియముగాన్. 118

చ. అని మహిమన్ మనుత్వమున♦నాతని బట్టము గట్టి పద్మలో
చనుఁడు విరించి శర్వముఖ♦సర్వసుపర్వులతో నదృశ్యుఁడై
చనియె నిజాలయంబునకు♦శాస్త్రవినిశ్చయయుక్తి దండపా
లనముల నవ్విభుండు ప్రజ♦లం బ్రజలట్లరసెం గృపామతిన్, 119

సీ. వానలు సరవితో ♦ వర్షించె సస్యముల్, వేళ్ల గొల్చుగ విఱ్ఱవీగి పండె
నారోగ్య పుత్ర పౌ♦త్రైశ్వర్యవంతులై, బ్రతికిరి నూఱేండ్లు ♦ పంచజనులు
పూవుఁబోఁడులు పతి ♦ దేవతలై రగ్ని,భయ తస్కర వ్యాధి ♦ భయములడఁగ
ఫలపయఃకుసుమాది ♦ బహు పదార్థంబులు, రసగంధసామగ్రి ♦ నెసక మెసఁగ
తే. నీత్యుపద్రవ మృత్యు రా♦హిత్య యుక్తి, ధరఁ బ్రజాభివృద్ధి తామర♦తంపరయ్యె
న్యాయపథమున స్వారోచి♦షాఖ్య మనువు, శ్రీలఁబొంది పాలించు ♦ కాలమునను.

క. కోరిక నీ స్వారోచిషు, చారిత్రము వినిన వ్రాయఁ ♦ జదివిన ధనధా
న్యారోగ్య పుత్రవంతులు, నై రూఢిగ గందురు పిదప ♦ నమరత్వంబున్. 121

తే. అని మృకండు తనూభవు ♦ డనుగు శిష్యు,
లైన క్రోష్టికి వినిపించి♦నట్టి యీ క
థాసుధాధార నించిరి ♦ దయ దలిర్ప,
జైమిని శ్రుతి పుటముల ♦ శకునివరులు. 122

శా. వ్యాయామస్థిర సంధిబంధ కటకా♦వ్యక్షోనుగక్షోణి భృ
త్కాయగ్రావభిదావిధాభి దురదోః ♦ ఖడ్గాగ్ర యుగ్రాచల
జ్యాయః కీర్తి భరప్రపంచవర సం♦చారాను రామామణీ
గేయామేయ జయాంక పంకజ దృగం♦గీకార ధీరాకృతీ. 123

క. కాంతాలకాంత శరయే, కాంతిక భక్తి ప్రతోషి♦తాంభోధిసుతా
కాంతా ప్రతాప రవిశశి, కాంతాయిత విమత నృపతి♦కాంతా హృదయా. 124

వనమయూరము. రాజ శరమేశ ఫణి♦రాజబల ఫుల్లాం
భోజ ముఖ భోజముఖ ♦ భూపవిపులాంసో
త్తేజిత ధరాభరణ ♦ దీక్షిత భుజా ని
ర్వ్యాజ భయదాజివిజి♦తారి నృపరాజీ. 125

ఇది శ్రీమదాంధ్ర కవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్ష
పాదాంబుజాధీన మానసేందిందిర నందవర వంశోత్తంస
శఠగోపతాపస ప్రసాదాసాదిత చతుర్విధకవితామతల్లి
కాల్లసాని చొక్కయామాత్య పుత్ర పెద్దనార్య
ప్రణీతంబయిన స్వారోచిష మనుసంభవం
బను మహాప్రబంధంబునందుఁ
సర్వంబును షష్ఠాశ్వాసము